# విషయసూచిక

—:o:—





# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

విద్యావిషయిక మాసపత్రిక

| సంపుటము 40 | ఏలూరు, 15 సెప్టెంబరు | సంచిక 6 |
| --- | --- | --- |







**వివరణము :**

ప్రపంచము భౌతికవిషయములం దగుల్కొనియున్నచో నది మొద్దువాఱి రసహీనమై పోవును. మాట వినదు. చిత్తమటులుండినచో మన ధ్యానసమయమున దానిని భగవంతునివైపునకు ద్రిప్పుట కెంత యత్నించినను వశపడదు. కాని నియమముల ననుసరించి జీవితమును క్రమముగ గడపువారిస్థితి వేరు. వారెల్లప్పుడును చుఱుకుగ నుందురు. వారెన్నడును దమ యాధ్యాత్మిక సాధనలను మఱవరు. వారి పనులన్నియును సాధనపరములై యుండును. మనకు కూడ నిట్టి యొరర్తుమా భావము లున్నతముగును. మన చిత్తవృత్తి మన జాగ్రత్త ననుసరించియే యుండును.

**సంకీర్తనము :**

ప్రభూ ! నా జీవితము నున్నతభావపూరితమును, తేజోమయమును, గావింపుము. నా చిత్తము నీయందు లగ్నమై విషయ వ్యామోహమునకు అతీతమై నీ చెంతనే వసించును గాక !

— స్వామి రామతీర్థ.

# విద్యాప్రచారము

[రుద్రాభట్ల - వేంకట భాస్కరరావు - చాపర]

("రైతుకే ఓటీయవలెనన్నా" అనువరుస)

విద్యకొరకై శ్రద్ధ బూనండీ! మీ బిడ్డలను మాబడికి చదువుకు వేగ పంపండీ।
చదువులేని మానవున కండీ! భువిలోన నిజముగ అదుపు బ్రదుకే యగును నమ్మండీ॥ విద్య॥
ఇతరదేశపు వింత జూడండీ। ఏయింట జూచిన చదువురాని నరుడు లేడండీ। విద్య॥
చదువు చక్కగ నేర్చినట్లయితే। మీబిడ్డలకు సద్గుణము లెన్నో కలుగు నిజమండీ॥ విద్య॥
ప్రజలదే పరిపాలనంబుగదా! ఈ భారమంతా నేటి బాలుర పైన గలదండీ॥ విద్య॥

---

## మానవవిధి : : : 'చిరంజీవి'

1. మానవునిగా పుట్టినందుకు – మనకు విధికద సోదరా!
మానకను పరమాత్ము నిశ్చలమతిని పూజ లొనర్పరా॥
2. పరమపావని భారతావని కొరకు జీవము నిల్పరా
భరతవీరుని కీర్తి దిశలను ప్రాకి వెలుగొనగాలిరా॥
3. మతమదేమో? కులమదేమో? మన కదెందుకు చూడరా
మానవత్వమె మతము కులమని మానవుడవై మెలగరా॥
4. ఆలుబిడ్డలు తల్లిదండ్రులె ఆప్తులని సుఖిగొనకురా
అఖిలమానవజాతి నీ పరమాప్తకోటని తలపరా॥
5. మానవుడుగా పుట్టినందుకు మానవుడవై మెలగరా
మానకను నీతోటిమానవు మనుపగనె బ్రదుకూనరా॥



# నవీన విద్యావిధానము - విషయ సమన్వయము



II

'చిరంజీవి'

నవీన విద్యావిధానమున మూలకంబమానదగు ముఖ్యసూత్రము 'బోధింపబోవు విజ్ఞానవిషయము తరగతి కనువగు నేదేని యొక కృత్యము నిర్వహించుటద్వారా సమన్వయపరచి చెప్పుట. ఈ విద్యావిధానము నమలుపరచుటకు బాధ్యతవహించిన యుపాధ్యాయుని చాకచక్య మీ ముఖ్యసూత్రము నర్థముగావించుకొని యాచరణయందుంచుటలో గాననగును.

విషయబోధన కాధారభూతముగనైకొనిన కృత్య ముద్దేశపూర్వకమైనదై, బాలుర వయోస్థితి కనువైనదై, వారి భావిజీవితాధార విషయ విజ్ఞాన పరిజ్ఞానము కలిగించునదై, యుండవలెను. కృత్యనిర్వహణా క్రీడావిధానము ననుసరించి పరిశ్రమరూపునంగాక మానసికోల్లాసము కలిగించునదై, విషయ విజ్ఞాన బోధనావసరమనకు ననుయుక్త సరణి సాగవలెను. సమన్వయపరుపబడు విజ్ఞానము బాలుర మానసిక పరిస్థితుల ననుసరించి యేర్పఱుపబడిన ప్రణాళికానుసారమగునదై యుండవలెను.

నవీన విద్య జీవితాధారవిద్య, కాన నీ విధానాన సాగును నిర్వహింపబోవు కృత్యము. నిర్వహించు విధానము – సమన్వయింపబడు విజ్ఞానము, బాలుర భావిజీవితాధార భూతములై యుండవలెను.

విషయబోధనకై కృత్యము నిర్వహింపబడుచున్నదను భావము విద్యార్థుల యం డుదయమందరాదు. దాన వారిలో కృత్యనిర్వహణమునందును, విషయశ్రవణమునందును, ఆసక్తి తొలగి యుపాధ్యాయుని ప్రయత్నము బూడిదలోపోసిన పన్నీరై అందులకు వెచ్చించిన యమూల్యమగు కాలమెల్ల వృథాయగును. కృత్యనిర్వహణానుభవమున గడించినవిజ్ఞానవిషయముల పునశ్చరణ గావించుటమూలముననూ, అట్టి విషయములతో సన్నిహితసంబంధము కలిగిన యితరవిషయముల సమన్వయపరచుట మూలముననూ, బాలురలో వివిధవిషయ విజ్ఞానాంశముల ప్రవేశపెట్టవలెను. ఈపద్ధతి మూలమున సన్నిహిత సమన్వయముగల వివిధవిషయ విజ్ఞానాంశములతో నొకేపరి విద్యార్థి పరిచయము కలిగించుకొనును. పరిజ్ఞానము కలిగింపనెంచిన యుపాధ్యాయుని ప్రయత్నము ననుసరించి విషయముల ప్రాముఖ్య ప్రాముఖ్యములుండును. ఇందువలన గణితవిషయబోధనావసరమున భాషాది యితర విషయములును, భాషాబోధనావసరమున గణితాది యితరవిషయములను, సన్నిహితత్వముననుసరించిసమన్వయపరుపబడుచుండును.

కృత్యనిర్వహణ సమయమున నుపాధ్యాయుడు పరిశీలకుడుగామాత్రముండి, విద్యార్థులచేతనే కృత్యము నిర్వహింపజేయవలెను. వారు తప్పు విధానముల ననుసరించునప్పుడు మాత్రము సరియగు విధానము

# కన్నకడుపులో కత్తిపోటు

రచన :
లాము ఇశ్రాయేలు–విద్యార్థి

"ఏయ్ !"
"ఏమ్ !"
"ఏఊరు ?"
"మాదా ?"
"ఔను"
"ఎంగుళు"
"ఏమీలేదు"
"ఏమీలేకపోతే సరి."
"చెప్పమంటే ?"
"తెలియదు."
"అంటే ?"
"మంటి."
"ఫలించదా ?"
"ఫలించదు."
"కారణం ?"
"సారంలేదు."

---

౧౨౩ పేజీ తరువాయి

సాధ్యమగునంతవరకు కారణసహితముగా నిరూపించి తప్పుకొనవలెను. నిర్వహణానుభవముద్వారా గడించిన విజ్ఞానవిషయములు నూటికగు. ప్రశ్నల మూలమున విద్యార్థుల కడనుండియే పరస్పర సంభాషణాలరూపమున రాబట్టవలెను. ఉపాధ్యాయుడు తానుపన్యాసకుడుగా మారిపోకుండ తగుజాగరూకత వహించుకొనవలెను. ఉపాధ్యాయుడెంత తక్కువగా మాటలాడిన నంతమంచిది. ఈ పద్ధతి మూలమున విద్యార్థులు స్వయముగ నార్జించిన విజ్ఞాన బీజములు వారి హృదయక్షేత్రములలో చక్కగా నాటుకొనును.

కృత్యనిర్వహణమున కాలమవసరమగు దానికన్న నధికముగా వినియోగించరాదు. విద్యార్థుల యుత్సాహము, శారీరకక్లేశములగమనించి, కృత్యవిభాగముండవలెను. తాను బోధింపనూహించిన విషయబోధన కనువగుదానికన్న నధికముగా వారిచే పని చేయించుటనవసరము. అట్లని యొక కృత్యము నసంపూర్ణస్థితిలో విడువరాదు. కృత్యనిర్ణయముపాధ్యాయుని తెలివితేటలపై నాధారపడియుండును. కృత్యము కృతకమైనదై, ప్రయోజనశూన్యమగునదై యుండరాదు. ఒక విషయమునందలి యన్ని యంశముల బోధనకొఱకే కృత్యము నిర్ణయింపబడరాదు. ఇది విద్యార్థులలో విషయపరిగ్రహణమున విసుగు కలిగింపజేయును.

ఇట్టివే యనేకములగు సత్యము లనుభవమున నుపాధ్యాయునికి తస్థించుచుండును. వానిని గమనించి యాచరణలో నుంచిననే యీ నవీన విధానమునను జయకరముగు చేయుటకు తగినవారగుదురు. ముఖ్యముగా నీ విధానమున కవసరమగునది యుపాధ్యాయులలో నీ సిద్ధాంతములగూర్చిన సరియగు విశ్వాసము — విశ్వాసము లేనిదే వానినపని సత్ఫలితముల నీయజాలదు. కావున నుపాధ్యాయులెల్లరు నవీనవిద్యావిధాన సిద్ధాంతములయెడ తగు గురినుంచి యీ విద్యావిధానము జయప్రదమగుటకు తగు చేయూత నొసగువారుగా కియుస కోరుచున్నాను.

"ప్రయత్నం?"

"అనవసరం."

"మరి లోకం?"

"ఆసంగతి నాకు తెలియదు."

"నీవు భావిపౌరుడవు."

"అది నే నెరుగుదును."

"మరేం?"

"యేమీ లేదు"—అని రెండడుగులు ముందుకు వేశాడు.

"అగు!..... యెక్కడికి?"

"నా భావిజీవిత పరిశోధనకొరకు"

"అదెక్కడుంది?"

"అంతులేని ప్రపంచంలో, తెలియరాని బాటలో, మరుగుపడిన మాటలో."

"అంటే?"

"నా ఆత్మను బలిచేయడమే."

"కారణం?"

"అసమర్థవంచనే"

"అందు తప్పెవరిది?"

"లోకానిది."

"కాదు"

"మరి?"

"నీదే."

"నాదా?"

"ఔను."

"యెలా?"

"పరీక్ష తప్పినందుకు మరణమా?"

"అది నాకు శిక్ష"

"వెఱ్ఱివాడ! శిక్షకీ ప్రపంచంలో కక్షకూడదు"

"కక్షకట్టి నే నెవరికీ ద్రోహంచేయడంలేదు"

"నీ మాతాపితలకు చేస్తున్నావు"

"లేదు."

"అట్టైన గురుద్రోహ మనబడుతుంది."

"గురువు అనుమతితోనే చేస్తున్నాను"

"ఆఁ! గురువు అనుమతించాడా? ఏమని?"

"సిగ్గులేదు? ఆ బ్రతుకుబ్రతికేకంటే యెందులోనైనా పడి చావకూడదూ? అని."

"పిచ్చివాడ! ఆ మాట నిజంగా చావమని గాదు. బ్రతకమని. తెలుసా? చచ్చే ప్రమాదం వచ్చినా చచ్చులేకుండా చెట్టుకు చేవకట్టించాలి. అది మానవుని చాకచక్యం. బుద్ధితెచ్చుకుని వెనుతిరిగి నీ గమ్యస్థానము చేరు. ఊఁ! వెళ్ళు. చచ్చి సాధించేదేమీ లేదు. బ్రతికియుండి యే కార్యమైనా సాధించాలి. తెలిసిందా?"

"ఔను...నిజమే!..తెలిసింది." చచ్చే ప్రమాదం వచ్చినా 'చచ్చులేకుండా చెట్టుకు చేవ కట్టించాలి, అది మానవుని చాకచక్యం!' ..వెడతాను... తప్పు మన్నించమని గురువు పాదాలపైబడి వేడుకుంటాను. నా భావిజీవితం కుళ్ళిపోకుండా చేవ కట్టిస్తాను! నిజంగా బలపరుస్తాను!—"అని అతని అంతరాత్మను సందేహ సమాధానాలతో శాంతపర్చి భావి జీవితములో తీయనియూహలను ప్రవహింపజేయుచు ఇంటిముఖం పట్టాడు మధు.

* * *

అదిగో! సూర్యుడు పడమటి కొండచాటుకు పోయాడు. ప్రపంచమంతా కారుచీకటి కాహుతై పోతూవుంది. చల్లని వానగాడ్పులు ఆ చీకటిముసు ప్రపంచములోనికి వీచనారంభించాయి. వీచే గాలికి పూసేపూలు స్థానాలువీడి భూమిమీదకువొరిగిపోతూ వుంటే చూచి సహించలేక కనిపెంచిన తీవెతల్లుల కన్నీటిబిందువులు నల్లటి మేఘాల కన్నీటి బిందువులలో లీనమైపోతూ వున్నాయి. తలలు దాచుకొన తావులేని పక్షిజాతములు చలిగాలకి చల్లగా జారి పడుతున్న వర్షబిందువులలో గడగడ వణుకుతూ రోడ్ల వెంబడి చెట్ల కొమ్మలపై తలలు వాల్చుకుని పొడిగి కూర్చున్నాయి. నిజంగా ప్రకృతిలో యిలా ఎన్నో జీవాలు కష్టాల కాహుతౌతున్నాయోగదా?

రాత్రి షుమారు 9 గంll లు కావచ్చింది. ఆ వర్షంలోనే తడిసి గూడలు ముణగబట్టి ఇంటి గుమ్మము లోనికి వెళ్ళి నిలుచున్నాడు మధు.

"అబ్బాయి ఇంకా రాలేదేమా రాత్రి తొమ్మిది గంటలైనా? యేదైనా ప్రమాదానికి గురియైనాడేమో?" అని దుఃఖబాగినియై మాట్లాడిన తల్లిమాట విని వెంటనే లోనికి తొంగిచూశాడు.

'అన్నయ్యేడి నాన్నా!' అని దీన హృదయంతో ప్రశ్నించే ఆడబిడ్డల్ని వర్షానికితడుస్తున్న ఆ ఇంట్లోనే ఓ మూల కన్నతండ్రి ఒడిలో కూర్చుండబెట్టుకుని, ఆ పసిపాపల ప్రశ్నలకు యేమీ సమాధానం చెప్పలేక భావిజీవితాన్ని పరిశీలిస్తూ కన్నీరు నింపుతున్న దృశ్యం అతని నేత్రాలలో దివ్యమై వెలిగింది. మాతృప్రేమ మరువరానిదై. 'అమ్మా!' అని అతనికి తెలియకుండగనే యతని మనస్సు ఆక్రోశించింది ఆ కేకవిని పట్టరాని సంతోషంతో వచ్చి కౌగలించుకుంది అతని వృద్ధ జనయిత్రి.

వృద్ధదశలోనున్న తల్లిదండ్రులను, ప్రపంచమంటే యేమో తెలియని యీ పసిగందులైన చెల్లెండ్రను చూడగానే మధు హృదయం నీరయిపోయింది. తన బీదస్థితికి తనెంతో పొక్కిపోయాడు. జాలిగుండెతో నిరాకారునిలాగ నిలుచుండిపోయాడు. కుమారుని హృదయాన్ని గ్రహించిన యీ వృద్ధ మాతాపితలు లోనికి తీసికొనిపోయి ఇన్ని ధైర్యపుమాటలు చెప్పి నీ కేమీ పర్వాలేదు నాయనా! అప్పో సప్పో చేసి ఈ సంవత్సరముకూడా, చదివిస్తాము. భయపడకు. ఇదిగో! అన్నంతిను" అని ఆ పూటకొచిన గంజి మెతుకులు కుమారునికి పెట్టబోయారు. కాని ఆ యీ వేదనలో 'అరగించడానికి అర్హుడవుకావు' అని అతనిమనస్సు ప్రతిధ్వనించింది 'నా కాకలి కావడం లేదమ్మా'అని చిన్నగొంతుతో సమాధానమిచ్చాడు మధు. కాని బలవంతాన తల్లి కుమారుని తినిపించి నది. భోజనాంతరం వర్షానికి తడిసిన ఆ యింట్లోనే పొడిగావున్న ఓ మూల జూచుకొని నిద్రాదేవి కౌగిట్లో సొక్కిపోయారు ఆ బీదజీవులు.

గాలికి రెపరెపకొట్టుకున్న దీపపు వెలుగుచమురులేక సమసిపోయింది. ఇంతలో కాలమానం కొన్నిగంటలు దొర్లిపోయింది నిద్రలోనున్న మధువాన్న ఉలిక్కి పడిలేచి, యెందుకో నలుమూలలా చూచాడు. అంతా చీకటి మయం. ఇంకా తెల్లారలేదా? అని ఆందోళనపడుతూ గడపలోనికివచ్చి వీధి వైపుతొంగి చూచాడు. గాఢాంధకారమైన చీకటి. కన్నుపొడుచుకున్నా కానరానట్లుంది. అష్టదిక్కులతో ఆవరించిన ప్రకృతంతా ప్రశాంతంగా నిదురిస్తుంది సముద్రపు అలలు మాత్రం ఓ మూల కొద్దిగా హోరుగల్పిస్తున్నాయి. అదితప్ప చీమచిటుక్కుమన్న చప్పుడు కూడా వినిపించడంలేదు. ఇప్పుడెన్నిగంటలౌతుంది? అని తనమనస్సులో గొణుక్కొంటూ మరలలోపలకువచ్చి కూర్చొన్నాడు. ఇంతలో ఆ పట్నంలోని తాలూకా అధికారులగంట టంగ్, టంగ్, మని నాలుగుసార్లు మ్రోగింది. దానికి ప్రతి సమాధాన మిచ్చినట్లు రేపు మధుని బడిలో జేర్చాలి, డబ్బులేదు. యెలా? అని అతని హృదయం టంగ్, టంగ్‌న కొట్టింది. వెంటనే కఱ్ఱచేతపట్టుకొని చింకి శాలికను ఆ సముద్రపు చల్లగాలికి శరీరముపై కప్పుకొని, ఆ గాఢమైన చీకట్లోనే తెలిసిన ఓ లాయరు గారింటికి ఆ వృద్ధు పయనమైవెళ్ళాడు. నిద్రలోనున్న లాయరును లేపగొట్టి 'బాబుగారు! బుడ్డోణ్ణి చదివించుకుంటున్నాను రేపు బడిలో జేర్చాలి డబ్బులేదు. దయచేసి పదిహేనురూపాయలుంటే సర్దండి బండిలాగి తమబాకీ కిల్లోళ్ళల్లో తీర్చుకుంటూను' అని జాలి గొంతుతూ ప్రాధేయపడి అడిగాడు. ఆయన్ని బాగా యెరిగినవాడు గనుక.

అతడు ఆ కటికచీకటిలో వచ్చినందుకు కాశ్చర్యపడుచూ "ఆఁ! నిన్ననేగవచ్చావుగాదే వెంకన్న? 500 రూ లుంటే నిన్నసాయంత్రమే మావాడు బ్యాంకులో కట్టివచ్చాడు ఊఁ! యెల్లా? అయినా మీ బోటి బీదవాళ్ళకు స్కూలు జీతముతేదే. అందులో గవర్నమెంటు తిరిగి కొంత డబ్బుకూడా యిస్తుంది. మరి అలాచేయలేకపోయినావు?"

"చేశాను బాబుగారు! మావాడికి 19 సంవత్సరాలున్నాయని ఇక్కడి స్కూలుమాష్టరే కొట్టేశారండి మళ్లీ ఈ రూలేందూలో?"

"ఔను వయస్సునుబట్టి చదువుండాలి. సరే ఇంట్లోఖర్చుకని 50 రూపాయలుంచాను. యేదో పెద్దవాడ వడిగావని ఇస్తున్నాను. మరల నెలగోజుం కల్లా అంద జేయాలిసుమా? అంటూ కోటుజేబులో నుంచి 15 రూ. లు తీసి లెక్కబెట్టి ఇచ్చాడు.

అవి అందుకుని ఆనంద బాష్పాలు రాలుస్తు, లాయరు గారికి తనహృదయ పూర్వక వందనము లర్పించి యీ బీద వృద్ధు తనగృహానికి చేరుకున్నాడు తెల్లవారకముందే ఆరోజే మధునిబడిలో జేర్పించాడు.

వెంకన్నకు రోజూ బరువుబండి లాగడం వృత్తి. దానిమీద వచ్చేరూపాయి, అర్ధతోనే కాలము గడుపుతూ, లాయరుగారి బాకీతీర్చడానికి కూడా ప్రయత్నంచేస్తూన్నాడు. కాని వచ్చినరూపాయి, అర్ధవారి పూట బత్తెమునకే చాలడంలేదు. బ్లాక్ మార్కెటీర్ల వల్ల ఒక్కొక్కరోజు సగమాకలితో నే కాలంగడుపుతున్నాడు వెంకన్న.

ఇంతలో బాకీ నెలగడువు దాటింది. యెక్కడ కనిపించినా లాయరు గారు బాకీవిషయం అడగడమే గాకుండ నోటఁబట్టని మాటలంటూన్నాడు, పిల్లల్ని అన్నంలేకుండా పూటగడుపుతేకున్నాడు. పోనీ ఒక పూట తనకడుపుకొల్చుకుని బాకీతీర్చుకుందామా అంటే, రెండవరోజు బండి లాగి పావులాడబ్బులు సంపాదించడంకష్టతరమౌతూంది, మానసికబాధలతో విచార పరంపరలతో సంసారసాగరములో మునిగి తేలుతూ, అతని కాలచక్రం దొర్లిపోతూంది,

(సశేషము)




సూర్యుడు ఆకాశంలో ప్రకాశిస్తున్నాడు. వేడిగాడ్పులు వీస్తున్నాయి. వాయుదేవుడు సూర్యుడూ ఒండొరులతో కలహించుచున్నట్లు యొకరిని మించియొకరు నిప్పులు కురియుచున్నారు. ప్రజలు పరితాపముచే గృహములు వీడివచ్చుటలేదు. జీవులన్నియు, ఛాయాదేవి శరణుపొంది రక్షింపబడుచున్నవి.

నడివీధిగుండా కాళ్ళు కాలుచున్నను ఛాయనుధిక్కరించి సూర్యాగ్నుల మధ్య సంధినెఱపుటకో యనునట్లుపోవుచున్నాడు. ఒకబీదపంతులు. ఆబక్కచిక్కిన శరీరం చిరిగిన చొక్కా సందులనుండి తళతళ మెరసిపోతూన్నది. మెలికలి తిరిగిన కండరములు గాలికియటునిటు కొట్టుకుంటున్నాయి. పాదములు చకచకనడచునపుడు టకటక మంటున్నాయి. శశికోసం సముద్రుడు పైకి యుబికినట్లు ఆతనియుదరము వెన్నుని తాకుటకు లోతుకు పోతూవున్నది. ఆతని కేశములు సూర్యకిరణాల్ని ఎదిర్చి సూటిగా నిలబడినాయి. ఆతడు పోయిపోయి సున్నపుగాంతులతో ధవళముగా విరాజిల్లుతున్న యొకసౌధము లోనికి తలుపులు త్రోసుకొనిలోనికి ప్రవేశించాడు. కిలకిలలాడుతూ పది, ఎనిమిదివత్సరములు గల బాలబాలికలు నలుగురైదుగురు స్వాగతమిచ్చారు. ఆ బాలబాలికలకు పాఠాలు చెప్పటం మొదలుపెట్టాడు. వారిలో అతను కలసిపోయి దుఃఖాలువిడనాడి పెదవులపై చిరునవ్వు చిందులాడిస్తున్నాడు.

ఇంతలో గృహయజమాని లోపలనుంచి వచ్చి యాలశ్యంగా వచ్చారత్లేవుండే! యన్నాడు. ఆమాటలు ఆతనికి సూదుల్లాగా గ్రుచ్చుకున్నవి. పాఠాన్ని యావుచేసి లేదండీ! గంజినీళ్ళు త్రాగి, బడివదలిన వెంటనే బయలుదేరివచ్చానన్నాడు. ఈ మాటలు యజమానికి తృప్తికలిగించ లేకపోయాయి.

బడికి ప్రయివేట్లకు యెట్లాకుదురుతుందండీ? రెండింటిలో ఒకటివుండాలి, మానవుడు రెండుపనులు చేయలేడు, కనీసం మీరు మాపిల్లలకు మూడుగంటలైనా చెప్పుతున్నారా? యేమిచెప్పటమండీయన్నాడు. ఆతనిగుండెలో రాయిపడింది. యీమాత్రం చెప్పలేకపోతే మీరు యికచెప్పనక్కర్లేదు యింటిపనులు చేసుకునేటప్పుడు యీవృత్తి దేనికి? యని ప్రశ్నించాడు.

బడిగంటలు మ్రోగాయి. టంగ్ టంగ్ మంటూ తిరిగి యాతని బుర్రలో పిల్లలు తరగతులు టీచర్సు లేటు మార్కులు హెడ్ మాష్టరు రిపోర్టులు గిర్రునతిరిగాయి. అప్పుడే వెళ్తారా? యనిగృహయజమాని తిరిగి ప్రశ్నించాడు. పాపం యేంజవాబు చెపుతాడు! ప్రయివేటు వదిలి పెడితే

యింటిలో పిల్లి లేవదు. నెలలకు నెలలు గతించి నా జీతాలు రావు ఒకప్పుడు వచ్చినా యవి వడ్డీడబ్బులకు తెచ్చుకు. తీర్చడానికి వడ్డీకేగాని యసలు తీరదు ? కర్తవ్యము ఏమిటి యని యాలోచిస్తూ యక్కడే కూలబడ్డాడు. ఇట్లు యెంతకాలం గతించినది యాతనికి తెలియదు.

బడిగంటలు తిరిగి టంగు టంగు మని మ్రోగినాయి. పిల్లలు పరుగెత్తుకుంటూ యిండ్లకు వెళుతున్నారు. తిరిగి యాతనికి మెలకువ కలిగింది. తనకళ్ళను తానే విశ్వసించ లేకపోయాడు. గబగబా వేడెక్కిన బుర్రతో బడివైపు పరుగెత్తాడు. బడికి తాళంబిగించివుంది, మరికొంత దూరం వెళ్ళారు. హెడ్ మాష్టరు గారు కనిపించారు ఏంచేస్తారు? తెల్ల కాగితంపై నల్లని యక్షరాలు కలిగిన కాగితంతీసి చేతికిచ్చారు.

అదిచూచి యాతని చేతులు వణికిపోయాయి బట్టలు చెమటతో తడిసిపోయినాయి. కండ్లవెంట జలరాసి ప్రవహింపసాగింది.

యేంజరిగింది? ఏముంది ! రానేవచ్చారు పరీక్షాధికారిగారు గైరుహాజరు కావటం ప్రయివేట్లు చెప్పుకోవడం, యీకారణాలతో ముప్పైరూపాయలతో శుష్కిస్తూ, దేశం కోసం జీవిస్తానంటూ, చేసుకొన్న ప్రతిజ్ఞపై దుమ్ముకమ్మింది. ఆకాశంపైనుండి వర్షిస్తూ భూమిపై కివచ్చిన మేఘునికికూడా యీ మాత్రంకష్టం తగులదు. తోడియుపాధ్యాయులకన్నులలో ఎర్రగా రక్తం పేరుకుపోయింది.

బడివైపు తిరిగి బయలు దేరాడు. యెందుకు వెళుతున్నాడో ? ఆబడిలోని కిటికీలు ఆవుపాధ్యాయునిచూచి కండ్లుమూసుకున్నట్లు బంధించుకున్నాయి. బడిముందు తోటలోని వృక్షములు, పూలమొక్కలు, కన్నీటి ధారలు వర్షిస్తున్నట్లుగా తలలు వాల్చాయి. తనకన్నీటి ధారలచే నతడు తిరిగి వాటిని స్వీకరించాడు.

సూర్యుడు ఈదృశ్యము చూడలేక పడమటివైపుగా పారిపోయాడు. అమావాస్యదేవి నల్లనిజడలతో యలంకరించుకొన్నట్లు సన్నని చీకట్లు భూమిపై ప్రకాశించాయి. కడసారి పీడ్కోలు తీసుకునేటప్పటికి రాత్రిపదిగంటలైనది. గ్రామంలోని ప్రజలంతా యాతని చేష్టలకు మతిపోయిందనుకున్నారు.

అతడు ఆరాత్రి సమయంలో యింటివైపు బయలుదేరాడు. ఆయిల్లు వయస్సున నడుము క్రిందికివంచినట్లుగా – నడికప్పు లోనికి పోయింది. చుట్టునున్న గోడలు అచ్చుటచ్చుట గంధ్రాలతో వెంటిరేటర్లు ఏర్పడినట్లుగా కనిపిస్తున్నాయి. దుర్గంధములో వాసము చేయు దోమలు ఆయింటి నిరవాస్యస్థలముగానుపయోగించుకుంటున్నాయి. కొండలోయవలె లోతుకు చొచ్చుకొని పోయిన యొక మంచములో నతడు కూలబడ్డాడు. అమావాస్యదేవి, యింటిసందులనుండి వచ్చి యాతనిపై నాట్యము చేస్తున్నది. "బడీ! బడీ!" యనే యాతడు వెర్రికేకలు వేస్తూనేయున్నాడు.

స్వప్నములో నున్నాడో, పిచ్చియెక్కినదో ! కలవరిస్తున్నాడో ! ఎవరూ ఏమీ తెలుసుకోలేదు. తెలుసుకోవాలని యా యింటి చాయలకైనా పోలేదు. అతని కేకలు అతని మనస్సును, హృదయాన్ని, సంతృప్తి చేస్తున్నాయి యీకేకలలో పిచ్చిగాని, రోగంగాని, లేదని యెవరు తలుస్తారు!




# ఎన్నికలు - ఉపాధ్యాయులు

శ్రీ కాకరపర్తి కామేశ్వరశాస్త్రి, ఖండవిల్లి.

త్వరలో ప్రపంచములో యే దేశములోను యింతవరకు జరుగనంతటి పెద్దఎత్తున 17 కోట్ల మంది వయోజనులతో దేశ వ్యాప్తమైన యెన్నికలు జరుగనున్నవి.

అప్పుడే వివిధపార్టీలవారు యెన్నికల ప్రచార కార్యక్రమం ప్రారంభించారు. ఎవరిమట్టుకు వారే పరిపాలనా యంత్రాన్ని హస్తగతం చేసుకోవడానికి ఎత్తులు వేస్తున్నారు

ఇట్టి తరుణంలో వుపాధ్యాయులతరపున ఒక ప్రతినిధి నెన్నుకొనుటకు ప్రభుత్వము వారంగీకరించినప్పటికి, అది అధమాధమస్థితియందున్న ప్రాథమిక పాఠశాలోపాధ్యాయులకు గాక యిదివరకే వున్నతస్థాయియందున్న వుపాధ్యాయులకే వర్తించును.

పరాయి ప్రభుత్వపు నిరంకుశ చట్టములలో పడి మ్రగ్గి దేశము సర్వస్వతంత్రం కాగానే తమ స్థితి చక్కబడునని ఆశించిన

---

౧౨వ పేజీ తరువాయి

యీ బాధ ఎవరికి అర్థమవుతుంది? మళ్ళీ బడిగంటలు మ్రోగుతున్నాయి, యీతని కేకలు వినిపిస్తూనే యున్నవి. పాఠశాలలోనికి బాలబాలికలు ఆయింటి ప్రక్కనుంచే వెళ్తూవున్నారు, వస్తున్నారు. బడిగంటలలో కలసిపోయిన యీతని కేక ఎవ్వరిని చలింపచేయటంలేదు సరికదా! మరింత పాషాణాలుగా మారుస్తున్నది. వారికిది యొక యానంద కాలక్షేపముగా కనపించుచున్నది. యేనాటికైనా యెవ్వరికో వినిపించకుండా వుంటుందా? యీ పాఠాలు యెవ్వరు నేర్పుకోకుండా వుంటారా?" యనే యాశమాత్రం అతనిలో చావలేదు. అతను అట్లాగే యరుస్తున్నాడు.

బడిగంటలు మ్రోగుచున్నాయి, అతని కేకలు వానికి జవాబిస్తున్నవి. ఇట్లా రోజూ కుక్కిమంచంలోనున్న పంతులుకు బడిగంటలకూ యవినాభావసంబంధం గాఢముగా పెరిగిపోయింది. యిది యితరులకు తెలియదు.

చంద్రుడు ఆకాశంలో ఎర్రని బింబములో తెల్లని కాంతులు వెదజల్లుతూ బయలుదేరాడు. బడిగంటలు మ్రోగి మ్రోగి యాగిపోయాయి. చంద్రుడు మాత్రం తనకు విద్య చెప్పే గురువుగా అతని స్వీకరించాడు. అతని నిర్మలమనస్సు తెల్లని కాంతులలో కలసిపోయింది. తెల్లవారేక బడిగంటలు మ్రోగాయి. కాని ప్రతిధ్వని లేదు. సిగ్గుతో తన మ్రోతను తగ్గించుకుంది.

— "నాగు"

ప్రాథమికోపాధ్యాయులకు జీవితనిర్వాహణకు వలసినంత వేతనము లీయకపోగా, తమ తక్కువ స్థితిని ప్రభుత్వమునకు నివేదించుకొనుటకు ఒక ప్రతినిధి నెన్నుకొను హక్కైనను ప్రసాదింపకపోవుట, ప్రాథమిక పాఠశాలోపాధ్యాయుల పురాజన్మకృత పాపకర్మము కాక మరేమి ?

రానున్న యెన్నికలలో వ్యక్తిత్వాన్ని గోల్పోయిన లంచగొండులు ప్రజానీకానికి ప్రభుత్వానికి, తీరని అపరాధాన్ని చేస్తూన్న ప్రత్యక్షరాక్షసులైన చీకటిబజారువర్తకులు యెందరో శాసనసభాసభ్యులుగా నిలబడుచున్నారు. మన ప్రభుత్వ దృష్టిలో వారందరు పెద్దమనుష్యులు కాబోలు !

సన్మార్గులై, స్వచ్ఛశీలురై, ముందర ఆరుమాసాల జీతం అడ్వాన్సుగా యివ్వనిదే పశువుల కాపరికైన పనిచేయని యీరోజులలో పనిచేసిన మూడుమాసముల తదుపరికైనను జీతములివ్వకపోయినను, ప్రభుత్వక్షేమమే తమ క్షేమమని భావించి, పని చేస్తూన్న వుపాధ్యాయులు మన ప్రభుత్వ దృష్టిలో అపరాధులు కాబోలు !

ఈ నియమింపబోవు అభ్యర్థి ప్రాథమికోపాధ్యాయులలోనివాడై యుండవలయును. ఏలయన వుపాధ్యాయుల కష్టసుఖములు వుపాధ్యాయునకే తెలియునుగాని, యెంతగా చెప్పినను యితరులకు తెలియునా !

ఇట ప్రాథమికపాఠశాలోపాధ్యాయుడు శాసనసభాసభ్యత్వము నునిర్వహింపగలడా? యను ప్రశ్న ఉత్పన్నము కావచ్చును. కాని ప్రస్తుతం శాసనసభలకు నిలబడనున్న ప్రతినిధుల స్థితి నరసిన ఈ ప్రశ్నకు సమాధానము దొరకగలదు.

వీరిలో చాలమంది III Form కూడా చదువనివారు కలరు. పెద్ద సంతకమా? చిన్న సంతకమా? యని యడుగవలసిన వారి సంఖ్య మెండు.

ఇక ఉపాధ్యాయులందురా ? ఎలిమెంటరీపాఠశాలలలో బి. ఏ చదివినవారికంటెను సమర్థులు, జ్ఞానులు, ఐన సెకండరీ గ్రేడు వుపాధ్యాయులుగలరు. వీరిలో చాలామంది దేశస్వాతంత్ర్యసమరంలో నానాయిక్కట్లు పడి, జైలుకుపోయినవారు కూడా కలరు. కావున ఆ సంశయము మనవసరము.

పై హక్కులను సాధింపవలయునన్న ప్రతి వుపాధ్యాయుడు కృషిచేసి, వుపాధ్యాయసంఘములద్వారా దీనిని అధికారుల దృష్టికి తేవలసియున్నది. ఇందుకుగాను ప్రతి వుపాధ్యాయుడు తన అధమస్థితిని గుర్తించి, అందుకు కారణములు గ్రహించి పురోభివృద్ధి నాశించి, వ్యక్తిత్వమును పెంచుకొని, యీ విషయంలో అందరు ఐక్యకంఠంతో మన హక్కులనుగూర్చి పోరాడవలసియున్నది.

ప్రత్యేకంగా వుపాధ్యాయ సోదరీమణులకు విజ్ఞప్తి :

ఉపాధ్యాయులలో సోదరీమణుల సంఖ్య మిక్కుటమైనప్పటికీ, వారిటువంటి విషయములలో కలుగజేసికొనుటగాని, కనీసం యీ విషయాలు తెలిసికొనుటగాని చేస్తున్నట్లు కానరాదు. దేనికైనా స్త్రీపురుషుల సహకారంలేనిదే విజయవంతం కావడం కష్టం. నిజానికి స్త్రీలేయెక్కువభాగం తీసుకోవాలి. కావున "సోదరీమణులందరు తమ కష్టములను గుర్తెరిగి, తన్నివారణకు ఉపాయముల నరసి, తమ యభిప్రాయములను

# నాలుగేండ్ల స్వతంత్రంలో ఉపాధ్యాయులు

శీలా వెంకటప్ప, టీచరు - కమలాపురం.

భారతదేశం పాశ్చాత్యదాస్య శృంఖలాలనుండి విడివడి నేటికప్పుడే నాలుగేండ్లుదాటి ఐదోయేడు పడుతున్నది. భారత స్వాతంత్ర్య పోరాటములో పూజ్యబాపూజీ నాయకత్వాన, అందరితోపాటు ఉపాధ్యాయసోదరులుకూడ యెందరో పాల్గొని తమపదవులను, ప్రాణాలను సహితం, కోల్పోయి స్వాతంత్ర్యాన్ని సంపాదించినారు. స్వాతంత్ర్య సంపాదనానంతరం మనకష్టాలు గట్టెక్కుతాయని, సుఖపడుతామని. యెంతో ఆశించాం. కాని మన ఆశలన్నీ అడియాశలయ్యాయి. ఈ నాలుగేళ్లలో మన స్వతంత్రజీవితం యెటువంటిది ? ప్రభుత్వం మనకేమి చేసింది? మన మెంతవరకు పురోగమించాము ? అని ఒక్కతూరి మనం సింహావలోకనంచేసుకోవడం అత్యవసరం.

ఈ నాలుగు సంవత్సరముల కాలంలో మనం, నిజమైన స్వాతంత్ర్యానుభూతిని పొందలేక పోయినాము ముఖ్యంగా తినేందుకు తిండి, కట్టేందుకు బట్ట, వుండేందుకుఇల్లు సామాన్యుడితోపాటు మనకు కూడ లభించక అనేక యిడుములకులోనైపోయాము. దుర్భర ఆర్థిక దుస్థితికి లోనై చితికిపోయినాము. అయినా దైవానుగ్రహంచే మనసోదరులు ఆర్థికసంక్షోభమునుండి దరిచేరుకొని తెప్పరిల్లినారు.

దేశభవిష్యత్తే అంధకార బంధురమై భయపెట్టబడిన సందర్భములో, దేశంలో తీవ్రమతకలహాలు నిజంగా సంభవిస్తాయన్న ఆదనులో, మన ధనవస్తు సంపదనంతను తమదేశాన్ని చేరవేసుకొని, దేశంలో తీవ్ర ఆర్థిక దుస్థితిని కలిగించిన క్లిష్ట పరిస్థితుల్లో, యుద్ధానంతరం దేశంలో ప్రజలు ఆహారపదార్థాలకు ముఖంవాచిపోయిన పరిస్థితుల్లో, పూజ్యబాపూజీ ధాకకు తట్టుకోలేక 1947 ఆగష్టు 15 అర్ధరాత్రిన విశ్వమంతా నిద్రాణమైయున్న సమయములో, బ్రిటిష్ ప్రభుత్వం భారతజాతిని మేల్కొల్పి "ఇదిగో అర్ధశతాబ్దంపైగా మీరు ఆందోళనచేసిన స్వతంత్ర జీవితాన్ని నేటినుండి అనుభవించండి" అన్నట్లుగా మనకు

౧౩౦ పేజీ తరువాయి

మన "ఆంధ్ర రాష్ట్ర ప్రారంభవిద్య" మొదలగు పత్రికారత్నములద్వారా వ్యక్తపఱచుచు, మన పురోభివృద్ధికి కృషిచేయ ప్రార్థన.

"ఓటు" అనునది ప్రతిమానవుని జన్మహక్కుకదా ? కొన్ని ప్రజాస్వామిక దేశాలలో జైలుకు వెళ్లినవానికి ఓటింగుహక్కు తీసివేయుటే పెద్దశిక్షట ! అంటే ఓటుయొక్క విలువ యెంతటిదో వ్యక్తమగును.

కావున మన ప్రజాప్రభుత్వము అట్టి హక్కును ఉపాధ్యాయులకు ప్రసాదించి, తమ తరఫున ఒక అభ్యర్థిని శాసనసభలకు పంపు హక్కును ప్రసాదించి, నిష్పక్షపాత దృష్టితో మెలగి, బాపూజీ ఆశయములను ఎన్నికల ప్రచారము నకుగాక యిట్టి విషయములలో జ్ఞప్తికితెచ్చుకొనవలసినదని మనవి చేయుచున్నాను.

"ఐకమత్యమే బలము" అని ఒకటవ తరగతి పిల్లలకు సైతం బోధిస్తున్న ఉపాధ్యాయులు ఆ సూత్రాన్ని అర్థంచేసుకోవలసిన సమయమాసన్నమైనదని గ్రహించి కనీసం యీ హక్కైనా సంపాదించనిదే భవిష్యత్తులో తమ మనుగడే దుర్భరమని గ్రహించి, ఐక్యకంఠంతో వీనికై పాటుపడుదురని ఆశిస్తున్నాను.

జైహింద్ !

సంక్రమించాల్సిన అధికారాన్ని దాఖల్ చేసి పరాయి ప్రభుత్వం పలాయన మంత్రం పఠించింది.

స్వాతంత్ర్యం వచ్చినాకూడ మన పరిస్థితులేమీ బాగుపడలేదు. దేశంలో మతకలహాలు, కాందిశీకుల సమస్య, నైజాం, కాశ్మీర్ సమస్య, పూజ్య బాపూజీ హత్య, మొదలైన క్లిష్టపరిస్థితులేర్పడి జాతీయ ప్రభుత్వానికే మహోపద్రవం యేర్పడినట్లుగా వుండినది. వీటన్నిటిని యెలాగో మననాయకులు శ్రీ జవహర్ లాల్ నెహ్రూ, పటేల్ గార్లు, అమోఘంగా ధైర్యముతో యెదుర్కొనగలిగారు. దేశంలో క్షోభం, అల్లకల్లోలం రేపిన హైదరాబాద్, జునాఘడ్ వంటి సమస్యలను సహితం పరిష్కరించి, శాంతిభద్రతలను కాపాడగలిగారు. అన్నిరాష్ట్రాలలో దాదాపు జమీందారీలను రద్దుపరిచి, భూస్వామ్య సంస్కరణలను, సాంఘిక సంస్కరణములను, ప్రవేశపెట్టినారు. మద్యపాన నిషేధము, న్యాయ శాఖావిభజనము, పంచాయతీ పరిపాలన, నిర్బంధ విద్యావిధానము, వయోజన విద్యాప్రచారం, మన్నగు సంస్కరణములను ప్రవేశపెట్టి, అభ్యుదయపథాన పురోగమిస్తున్నది మన ప్రభుత్వం.

మనదేశం స్వాతంత్ర్యానంతరం అంతర్జాతీయ రంగంలో ఒక మహోన్నతమైన పీఠాన్ని అలంకరించింది. ముఖ్యంగా ప్రాచ్య ఖండములో ఒకజ్యోతిలాగ దేదీప్యమానంగా వెలుగుతూవున్నది. పాశ్చాత్య సామ్రాజ్య దాస్య శృంఖలాలనుండి ప్రాచ్యరాజ్యలను రక్షించేందుకు నాయకత్వం వహిస్తున్నది. బర్మా, సింహళము, ఇండోనీషియా దేశాల స్వాతంత్ర్యలబ్ధికి ఇండియా సహాయ సహకారములే నిదర్శనము. అద్యతన భావిలో మనదేశం అగ్రగ జ్యాలలో నొకటై తలమానికముగా నుండవచ్చును. ఇన్నివిధాల మనం మన స్వాతంత్ర్యాన్ని సార్థకంచేసుకొంటూ, రక్షించుకుంటూ, వున్నాము, చాలా వర్ణనీయమే.

అయితే మనప్రభుత్వం ఇన్ని ఘనకార్యాల్ని సాధించి కీర్తి ప్రతిష్ఠలు ఆర్జించినా ఆర్థికరంగములో మాత్రం పురోభివృద్ధిని సాధించలేకపోయింది. అందుకు కారణం దేశములో ప్రబలిన అవినీతి, స్వార్థపరత్వము, లంచగొండితనము, బ్లాక్ మార్కెటు, ఆర్థిక దుస్థితి -ఇవే ముఖ్యకారణాలు. ప్రజాసామాన్యముపై వివిధరకములైన పన్నులను విధించినందున ప్రజాబలాన్ని కోల్పోతున్నది. అసంతృప్తులైన ప్రజాసామాన్యం యొక్క ఆదరాభిమానములకోసం "కుక్కగొడుగుల్లాగ" రకరకాల పార్టీలు ఆవిర్భవించి ప్రజల్ని ఆకర్షిస్తూన్నాయి.

నాడు భారతస్వాతంత్ర్య సమరములో పూజ్య బాపూజీ నాయకత్వాన అవిరళోత్సాహంతో పాల్గొని, శ్వేతమూకల గుండెలమీద శంఖము పూరించిన మనస్థితి ఈనాలుగేళ్లలో యెట్లున్నది? నాటి కంటె హెచ్చైన పురోభివృద్ధి చెందినదా? భారత ప్రజాసామాన్య మానవుణ్ణి స్వతంత్ర జీవితములో తేలిగిన మార్పుకంటె వుపాధ్యాయుల స్వతంత్రములో మార్పేమీలేదు. స్వతంత్ర భారతదేశములో పంతుళ్ల ఆర్థికస్థితి కడుదుర్భరం. యుద్ధానికి పూర్వం ధరలకంటె ఒకటికి పదిరెట్లు పెరిగి మన ఆర్థికదుస్థితి మరింత చితికిపోయింది. మనబాధ్యతలుకూడ ఇతోధికమై అధికతరప్రయాసకు గురిచేస్తున్నవి. తెల్లప్రభుత్వం హయాములోవుండే హక్కులుకూడ హరించిపోయి, అఖరుకు సంఘాలుకూడ నిర్మించుకొనే హక్కును కోల్పోయి, నిర్వీర్యులమై పోయాము. సరిగదా M. E. R 154 వంటి G. O లతో మన కుత్తుకలకు ఉచ్చులు బిగించి, వుద్యోగానికి గ్యారంటీ లేకుండా ఇంటికి పంపుతున్నది. ఇందుకా మనము మన ఉద్యోగాల్ని, ప్రాణాల్ని, బలిపెట్టి స్వాతంత్ర్యాన్ని ఆర్జించుకొన్నది?

ప్రభుత్వం ఈనాడు అందరితోపాటు బాధిస్తున్న పంతుళ్ల సమస్యలనుకూడ గుర్తించి కూడు, గుడ్డ వీటిసాధనకోసం తీవ్రమయిన కృషిసల్పి పరిష్కరించవలసియున్నది. మన గౌరవ హోదాలు, హక్కులు, కాపాడవలసి యున్నది. యెప్పుడైతే ప్రభుత్వం వుపాధ్యాయులలో ప్రబలిన నిరాశా నిస్పృహలను, తొలగించేందుకు పూనుకొని, దుర్భర ఆర్థికసంక్షోభంనుండి కోలుకొనేటట్లు చూస్తుందో అప్పుడే ప్రభుత్వం విద్యాప్రణాళికలు, కమిటీలు, జయప్రదమై దేశభవిష్యత్తుమీద అచంచల విశ్వాసం కలిగి, దేశాభ్యున్నతికి, సర్వమానవ సౌభ్రాతృత్వానికి, తోడ్పడుతారన్న నగ్నసత్యాన్ని ప్రభుత్వం గుర్తించుతుందని మిక్కిలి విశ్వసిస్తూవున్నాను.

"జై భారత్"

# :: జ్ఞాన నేత్రము ::

[1951 మేనెల సంచిక 37 పేజీతరువాయి]

సీ. వేద వేదాంగకోవిదుఁ డైన చాణక్య, విజ్ఞాన మిను స్థాపించుశక్తి;
కవిముత్తమాతంగ కంఠీరవుం డైన, కాళిదాసాఖ్యుని కవితశక్తి;
దివ్యతరం బైన దేవదత్తంబు నా, వశమందు నున్నచో వాక్కీర్తి
భువిని సంతోషించి పూరింతు సర్వత్ర, హృద్యమౌ విద్య వైశద్యపూర్తి
తే. పల్లవింపగ మనదేశ ప్రాభవంబు, శిష్టవర్తన నృత్యము చేయకేల.
గోఖలే చెల్వు లోకోక్తి కూర్మిసూక్తి, బాలలీలలు ప్రకటింపఁ జాలమేల.

ఇది 25వ పద్యము; పునః వ్రాసితిని; పాఠకమహాశయులు సంస్కరించి చదువవలయును.

తే. వత్సరములైదు నెలలైదు వాసరంబు, లైదు వచ్చిన నక్షరాభ్యాసమునకు
సమయమని యెంచి యటనుండి చదువు చదివి, మర్మములనెల్లగుర్తించి మసలవలయు.
తే. బాల్యమందునె యొంటను బట్టినట్టి, యక్షరంబులు మదిని శిలాక్షరములు
నేతబట్టను బట్టిన నీటురంగు వలెను కలకాల మభివృద్ధి వఱలు వత్స. 30
తే. బుద్ధిమతునకు జడునకు శ్రద్ధతోడ, గురుఁడు విద్యను సమముగా గూర్చుచుండు
గాని జడబుద్ధి భేదంబు గానిపించు, మణులతో గాజుకాంతి సమంబె వత్స! 31

శ్రీ పట్. సూర్యనారయణకవి, బొబ్బిలి.

---

# *** కాలమహిమ ***

శ్రీ పోచినపెద్ది రామారావు-టీచరు-సాలూరు

మేనేజరు :
కల్లబడులు పెట్టి గ్రాంట్లు సంపాదించు
గురుల జీతమందు కోతగోసి
మాయనాటకాలు మానేజరాడును
ఐంద్రజాలికులను అనుకరించు.

హెడ్మాష్టరు:
సోదర గురూత్తముల చూచు చులకనగను
ధరణిలోన హెడ్మాష్టరు దర్పమలర
ఆ యసిస్టెంట్లుగూడ హెడ్మాష్టరన్న
నీచముగ చూచుచుంద్రు సంకోచపడక

ప్రభుత్వము:
ట్రెయినింగు గాని టీచరు
'కానీ' విలువైన చేయగా జాలడుగా
వానిని ప్రభుత్వ మన్నిట
హీనునివలెజూచు; మఱి గణింపదు సరిగా !

# ఉత్తర సర్కారులలో వయోజన విద్యాశిక్షణ

1951-52 సంవత్సరమునకు ఉత్తరసర్కారు జిల్లాలకు గుంటూరులో గుజ్జన గుండ్లకు దాపులోవున్న శ్రీ గౌరవ లెఫ్టనెంటు పాములపాటి వెంకటకృష్ణయ్య చౌదరిగారి సెంటరులో ప్రభుత్వ వయోజన వుపాధ్యాయ శిక్షణకేంద్రము గత మే 16 వ తేదినుండి నిర్వహింపబడుచున్నది. యీ శిక్షణకేంద్రముద్వారా ఉత్తర సర్కారు జిల్లాలలోవున్న ఉపాధ్యాయ సోదరులకు యీదిగువ సూచించిన విధముగా, జట్టులవారిగా శిక్షణ యిచ్చుటకు మద్రాసు ప్రభుత్వమువారు సంకల్పించి యున్నారు.

మొదటిజట్టు-ఉత్తర గుంటూరు జిల్లా 16-5-51 నుండి 29-6-51 (శిక్షణ పూర్తిఅయినది)
రెండవ జట్టు-దక్షిణ గుంటూరుజిల్లా 7-7-51 నుండి 20-8-51 (శిక్షణ పూర్తిఅయినది)
మూడవజట్టు-తూర్పుకృష్ణా జిల్లా-28-8-51 నుండి 11-10-51.
నాల్గవజట్టు-పశ్చిమకృష్ణాజిల్లా 20-10-51 నుండి 8-12-51.
ఐదవజట్టు-తూర్పుగోదావరిజిల్లా 11-12-51 నుండి 25-1-52
ఆరవజట్టు-పశ్చిమగోదావరిజిల్లా 2-2-52 నుండి 17-3-52.
ఏడవజట్టు-ఉత్తర దక్షిణ విశాఖజిల్లాలు 25-3-52 నుండి 8-5-52

శిక్షణ పొందుటకు కావలసిన విద్యార్హతలు—

III rd ఫారంగాని, 8 వ తరగతిగాని, హయ్యర్‌గ్రేడ్ కన్వర్టుగాని, ఓరియంటల్ ప్రవేశ పరీక్షలలో వుత్తీర్ణులైన వారుగాని, పనికివస్తారు.

వయఃపరిమితి:— 20 సంవత్సరాలునిండిన దగ్గరనుండి 45 సంవత్సరాలలోపు

శిక్షణకాలములో ఉపకరణములు తయారుచేసుకొనుటకుగాను కావలసిన సామాగ్రికి తలకు రు10-0-0 లకు (పదిరూపాయలు) మించకుండా గవర్నమెంటువారు యిస్తారు. స్టయిఫండు నెలకు రు 22-8-0 లవస్తుంది శిక్షణ పొందినతరువాత రోజుకు గంటన్నర అదనపుసేవకు 12-0-0 లు (8+4) వుపవేతనముగా, రు 8-0-0 లు బోనసుగా యిస్తారు. ఈ బోనసు సంవత్సరము ఆఖరున లెక్కకట్టి యిస్తారు. దీనికిగాను 96 మందికి తక్కువలేకుండా సంవత్సరమునకు వారివారి ప్రాంతములలోవున్న వయోజనులను అక్షరాస్యులుగా చేయవలసి యుంటుంది దీనికి తగినపద్ధతులు కావలసిన సహాయాలు అన్ని వివరంగా శిక్షణకేంద్రములో చెపుతారు భోజనసదుపాయములకుగాను ప్రత్యేకమైన ఒకహోష్టలు కూడాసహకారపద్ధతిలో ఉపాధ్యాయ విద్యార్థులచే నిర్వహింపబడుచున్నది భోజన ఖర్చులక్రింద అడ్వాన్సుగా ప్రతి వుపాధ్యాయ విద్యార్థి రు 30-0-0 లు, అడ్మిషన్ రోజుననే కట్టవలసియుంటుంది. ఈ ఖర్చులు వీలైనంత తక్కువలో పరిమితం చేయబడుతవి. కొద్ది జీతాలతో కష్టపడుచున్న మన వుపాధ్యాయసోదరులకు దేశసేవ చేయటానికి, తద్వారా అదనపురాబడి పొందటానికి, అవకాశములువున్న యీవయోజన విద్యాసేవను హస్తగతముచేసుకొండని హెచ్చరిక చేయుచున్నాను.

ఇంకా యీ సంవత్సరానికి శిక్షణ పొందవలసిన కృష్ణాజిల్లా మొదలుకొని విశాఖజిల్లాలవరకువున్న ఉపాధ్యాయులు, సంఘసేవకులు, ఇప్పటినుండే త్వరపడవలెను. వారివారి జిల్లా విద్యాశాఖాధికారులకు రేంజివిద్యాధికారులద్వారా దరఖాస్తులు పెట్టుకోవలెను. సీటువచ్చినవెంటనే యెన్నికష్టనష్టములున్నను అమూల్యమైన ఈ తరుణము పోగొట్టుకోకుండా శిక్షణపొంది, రోజురోజుకు విస్తృతమయ్యే, యీ వయోజన విద్యాసేవకు పూనుకోవలసినదిగా కోరుచున్నాను.

మకాం: గుంటూరు. }
తేది: 18-7-51 }

మీ శ్రేయోభిలాషి.
నర్రావుల వెంకట సుబ్బారావు,
ప్రధానోపాధ్యాయులు - గవర్నమెంటు వయోజన ఉపాధ్యాయ శిక్షణకేంద్రము - గుంటూరు




## ౧. రికార్డుషీటు విలువ లేదా?

ఆర్యా!

పూర్వము అనగా 1933 సంవత్సరమునకుముందు ఎలిమెంటరీ స్కూలులో 5 వ తరగతి ప్యాసయిన విద్యార్థులకు ఇన్‌స్పెక్టింగు ఆఫీసర్లు సర్టిఫికెట్లు నిచ్చెడివారు. అట్టి విద్యార్థులు యింగ్లీషు స్కూళ్ళలో చేరవలసి వచ్చినచో సెకండరీ స్కూళ్ళలో 4 వ తరగతియందుమాత్రమే చేరగలిగెడివారు. మరిన్ని 3 వ తరగతి ప్యాసయినవారినికూడా సెకండరీ స్కూల్సులో 4 వ తరగతియందు జేర్చుకొనెడివారు.

కాబట్టి ఎలిమెంటరీ స్కూళ్ళలోని 4, 5 తరగతులలో విద్యార్థులు నామమాత్రమునకు ఏ కొలది మందియో ఉంటూవచ్చిరి. పిమ్మట ఎలిమెంటరీస్కూళ్ళవారు ప్రొపోర్షనేటు రోలుసంఖ్య లేనందుకు విధించే కట్టు భరించలేక సక్రమాందోళనచేయగా ప్రభుత్వం మిడిల్ స్కూళ్ళలోను, సెకండరీ స్కూళ్ళలోనుగూడ 4, 5 తరగతులు మూసివేసి 1 వ ఫారంనుండియే నడపుచు వచ్చినది.

1938 సంవత్సరంలో డైరక్టరుగారు రికార్డుషీటు పద్ధతిని ఎలిమెంటరీ స్కూళ్ళలో ప్రవేశపెట్టిరి. ఒక ఎలిమెంటరీ స్కూలునుండి మరియొక ఎలిమెంటరీ స్కూలుకు విద్యార్థి వెళ్ళినప్పుడెల్లను ఆ షీటుగూడా తీసుకొని వెళ్లుచుండును. కాని 5 వ తరగతి ప్యాసు అయినవెంటనే ఆ సీటును ఆ విద్యార్థిచేత సంతకము చేయించుకొని అతని కిచ్చివేయవలెను. ఇంతవరకు రికార్డుషీటు ఉపయోగకరముగనే యున్నది.

కాని ప్రస్తుతము ఇంగ్లీషు పాఠశాలలలో 1 వ ఫారంలో చేరవలసిన విద్యార్థి ఎలిమెంటరీస్కూలులో 5 వ తరగతి లేక 4 వ తరగతి లేక 3 వ తరగతి ప్యాసుఅయి లేక ఫెయిల్డు అయిగూడ యింగ్లీషుస్కూళ్లకు పోవుచున్నాడు. ఇంగ్లీషు స్కూళ్ళవారు తమ స్కూలులోని గత సంవత్సరం 1 వ ఫారం పిల్లలందరు 2 వ ఫారంలోనికి ప్రమోషను అయినందువలనను, 1 వ ఫారంలో యీ సంవత్సరం ఫెయిల్డు విద్యార్థులు కొలదిమంది మాత్రమే మిగిలియున్నందువలనను 3, 4, 5 తరగతులనుండి వచ్చినవారి నందరనుగూడ జేర్చివేయుచున్నారు.

మరిన్ని శాస్త్రమునకు, సూత్రమునకు మాత్రము రికార్డుషీటు తెమ్మనుచున్నారు. ఆ షీటులో 3 వ తరగతి ప్యాసు లేక 4 వ తరగతి ఫెయిల్డు లేక 5 వ తరగతి ఫెయిల్డు అని వ్రాసియున్ననుగూడ 6 వ తరగతిలో (1 వ ఫారంలో) జేర్చివేయుచున్నారు.

కాబట్టి డిపార్టుమెంటువారు 5 వ తరగతి ప్యాసయినట్లు రికార్డుషీటు తెచ్చిన విద్యార్థులనే ఇంగ్లీషు స్కూల్సులో 1 వ ఫారంలో వేసికొనవలెను. అంతకు తక్కువ చదివినవారిని ఎంతమాత్రం చేర్చుకోరాదు. అనే నిబంధనను ప్యాసుచేయవలెనని యీ లేఖ ద్వారా మనవిచేయుచున్నాను. అన్నిబాపతుల ఉపాధ్యాయ సంఘములు పత్రికలద్వారాను, రిజల్యూషనులద్వారాను, విజ్ఞప్తిపత్రములద్వారాను దీనికొరకు సక్రమంగా నాందోళన చేయవలెనని హెచ్చరించుచున్నాను,

కొర్లపాటివారి పాలెం,
11—8—1951.

కొండ్రెడ్డి సూర్యప్రకాశం,
టీచరు మేనేజరు.

## ౨. ఎయిడెడ్ ఎలిమెంటరీస్కూళ్ల టీచర్లు - ప్రావిడెంటు ఫండ్లు

ఆర్యా! మద్రాసు విద్యాశాఖవారు ప్రతి ఉపాధ్యాయుడూ, టీచర్స్ ప్రావిడెంటు ఫండు కట్టవలెనని ఒక ఫర్మానాను జారీచేసిరి. బోర్డుస్కూళ్ళ టీచర్లు, మిషన్‌స్కూల్లు అసిస్టెంట్సు, గవర్నమెంటుస్కూళ్ళ ఉపాధ్యాయులు, తదితర సంస్థలకుజెందిన ఉపాధ్యాయులు తప్పనిసరిగా కట్టుచున్నారు. ప్రభుత్వ శాఖలలో గల కొందరు ఉద్యోగులకు వారు ఉద్యోగమునుండి విరమించు కాలములో వారికి "పెన్షను" రూపముగాను "ఫండు" రూపముగాను ఇచ్చుచున్నారు.

ఏ యితర రాబడిలేని ఈ చాలీచాలని జీతముతో జీవితనౌకను నడుపుచున్న యీ బీద బడిపంతుళ్ళకు ప్రావిడెంటు ఫండు కట్టు సదవకాశము కల్పించినందులకు ఎంతయు కృతజ్ఞులము. కాని కొందరు ఎయిడెడ్ ఎలిమెంటరీ పాఠశాలల ఉపాధ్యాయులు టి. పి. యఫ్ కట్టెదమన్నా వారి మానేజర్లు కట్టు పైకము చెల్లించలేక ఆటంకము చేయుచున్నారు. కొందరు పై అధికారులు ఈ విషయమునుగూర్చి యుపేక్షాభావము వహించుచున్నారు. ఇట్టి లోటుపాటులను ప్రభుత్వము గుర్తించి నిర్బంధముగా "ఫండు" కట్టి తీరవలెను అని తాఖీదులు జారిచేయగలందులకు కోరుచున్నాను.

ఈ ప్రావిడెంటు ఫండు లేకపోయినచో యీ బీద ఉపాధ్యాయులు రిటైర్డు అగు కాలములో ఏ ఆధారములేక కడు నిక్కట్లకు గురికావలసివచ్చును. ఇతనిపై ఆధారపడియున్న ఆలుబిడ్డలు యే దిక్కులేక' అన్నమో రామచంద్రా అనుచు పడరాని యిడుములు పడవలసివచ్చును. కాబట్టి యిప్పుడైనను ఈ సదవకాశమును సద్వినియోగము చేయునట్లు ఏర్పాట్లు చేయించగలందులకున్నూ, ప్రావిడెంటు ఫండు నిమిత్తం అప్లికేషన్ పెట్టకపోతే రికగ్నిషన్ తొలగించబడును అని తాఖీదులు ఇప్పించగలందులకున్నూ ప్రార్థించుచున్నాను. మా రేంజిలో ఒక్క ఉపాధ్యాయుడుగూడ టి. పి. యఫ్. చందా కట్టుటలేదు; ఎన్నో సంవత్సరములు సర్వీసు గలిగియున్నారు గాని వారు ఎట్టి ఫండుగాని, ఇన్సూరెన్సుగాని కట్టుటలేదు. దయవుంచి ఈ సదవకాశమును అతి త్వరలో మా ఉపాధ్యాయ లోకమునకు అందుబాటులో వుండునట్లు ఏర్పాటు చేయగలందులకు యీ లేఖద్వారా మఱిమఱి వేడుచున్నాను.

సాలూరు,
22—8—1951.

ఇట్లు,
బి. పరమేశ్వరరావు.

# కుంటివాని బ్రతుకు దెరువు

నిరక్షరాస్యతను నిర్మూలించాలి! అందరూ అక్షరాస్యులు కావాలి! అందుకు తగినయత్నములు చురుగ్గా జరుగుచున్నవి. విద్యాభివృద్ధినిగోరి స్త్రీలను, నిమ్నజాతుల వారిని తక్కువమార్కులు వచ్చినాసరే ఉత్తీర్ణు లయినట్లు అంగీకరించుచున్నారు. పేదలకు ధనసహాయము చేయుచున్నారు. క్రొత్తగా స్కూళ్ళను అభివృద్ధి చేయుచున్నారు. బాగుగానేవుంది. కానీ! చదువుకొని ఎన్నో సర్టిఫికేట్లు సంపాదించిన కుంటివానివిషయమున ఏ సదుపాయము ఉన్నట్లు కన్పించటంలేదు. ప్రభుత్వోద్యోగము చేయుటకు కుంటివాడు పనికిరాడుసరిగదా! చిన్నపిల్లలచే ఓనమాలు కూడా దిద్దించేందుకు హక్కులేదు? అర్హత లేదు? వ్యయప్రయాసలకోర్చి కుంటివాడు చదువుకొన్నందుకు ఫలితం? శూన్యం! ప్రాథమిక పాఠశాలోపాధ్యాయుడుగూడా కానేరడు. ఎంత విజ్ఞానమున్నా, చదువుకున్నాసరే! వీలుపడదు. పోనీ అన్ట్రయిండుగానైనా ప్రాథమికపాఠశాలలో ఉందామని కక్కుర్తిపడితే రెండేండ్లకన్నా ఎక్కువ వీలులేదట. మిగులమిక్కిలి ట్రయినింగుకు పనికిరానివానికి అన్ట్రయిండుగా ఎలాగువుంచడం? అని సమస్య.

కుంటి అనగా ఏదోఒక లోపముగదా? నేడు ప్రాథమిక పాఠశాలలయందు పని చేయుచున్న వారియందేలోపము లేదా? కాలు కుంటుపడినంత మాత్రాన సర్వము అనగా ఆలోచనా, బోధనాశక్తి, దయ, సత్యము, శుచి, ప్రేమ, మానాభిమానములు మొదలగు అన్నీ కుంటుపడునని యే ధర్మశాస్త్రమందైనా ఉన్నదా? పైన పేర్కొన్న సుగుణములన్నీ గలిగినప్పటికీ కాలు కుంటుపడినంతమాత్రాన ప్రాథమిక పాఠశాలోపాధ్యాయుడుగూడా కాకూడదనడం ఏదేధర్మమో! లేక కుంటివాని కర్మమో!!

శరీర కష్టమున కోర్వజాలనివాడుగాన నిర్వ్యాపారుడుగా నుండక తగినంత పరిశ్రమచేసి, సోమరియై యుండక, తోడివారలను, బాలబాలికలను, అక్షరాస్యులజేయగలడు. నిజమాలోచించినచో నిరక్షరాస్యతా నిర్మూలకులలో మొదటివాడు చదువుకున్న కుంటివాడు. అట్టివానికి ప్రాథమికపాఠశాలయందడుగిడుటకు హక్కు లేదు.

కాలుకుంటివాడు అన్నిటను అసమర్థుడని అనుకోడం చాల పొరపాటు. కుంటి ఉపాధ్యాయులు ప్రస్తుతము క్రొత్తస్కీము ప్రకారము పనికిరారని, ఓల్డుస్కీముప్రకారము సర్వీసుచేస్తున్నవారినితొలగించారా? లేక వారి పనిపాటలందేలోపమైనకన్పించుచున్నదా? అందువల్ల నష్టమేమైనా యున్నదా? మామూలు ఉపాధ్యాయులకంటె ఎన్నోరెట్లు సూక్ష్మముగాను, సున్నితముగాను, పిల్లలకు బోధించి ఉన్నతవిద్యనభ్యసింపగలవారికి చేయూతనిచ్చి, మన్న

## *** వింత మాటలు ***

తమ్ముళ్ళూ! చెల్లాయిలూ! ప్రక్కనచూపిన అర్థప్రకారం యీవింత మాటల్ని ఒక్కొక్క అక్షరంతో పూరించండి. చేతగాకపోతే మీపంతులుగార్ని అడిగి తెలుసుకోండి బలే గమ్మత్తుమాటలు.

మీమిత్రుడు, పి. సూర్యనారాయణ పట్నాయక్.

* * *

1—వనము:—ఆడవాళ్ళు కొప్పులో పెట్టుకొంటారు
2—వనము:—ప్రపంచం
3—వనము:—పెద్దపులి
4—వనము:—కవిత్వం
5—వనము:—బ్రతుకు
6—రణము:—చావు
7—రణము:—ఒక ఉద్యోగి
8—రణము:—ఒక వాద్యవిశేషము
9—రణము:—శుభమును సూచించేది

---

13 వ పేజీ తరువాయి

నలుసుగోని, ఆ స్కూలు పరువు-ప్రతిష్ఠల నిల్పుచున్న కుంటిఉపాధ్యాయు లెందరు లేరు? 1939 కి పూర్వము ట్రయినింగు అయినవారిలో లేని దోషము నేటి కుంటివారిలో ఏమున్నదని కనిపెట్టారో? పెద్దలు.

హరిజనులు దేవాలయములో ప్రవేశించరాదనడంలో ఎంత ధర్మం ఉన్నదో కుంటివాడు ఉపాధ్యాయుడు కాకూడదు అనటంలోకూడా అంతే! ప్రతి వ్యక్తికి ఒంటినిండా బట్ట పొట్టనిండా కూడు, ఇద్దామని ఏదో ఒక వ్యక్తిని కల్పించి చూపి, దరిద్రదేవతను, బిక్షమెత్తుకొనే వృత్తిని నాశనంచేద్దామని ఉద్దేశించిన స్వతంత్రమాతదృష్టిలో కుంటివాడు లేడు. సరిగదా! దేశమందలి మరి యెవ్వరికికూడా దృష్టి వీనిపై ప్రసరించడం లేదు. అయితే కుంటివాడు చదువుకున్న ఫలితం?...శూన్యం. వాని సర్టిఫికెట్లు! పొయ్యిదాఖలాలు కావలసినదే! వాని వృత్తి!... భిక్షమెత్తుకోవడం?... తప్పనిసరి.

చదువుకుగూర్చి కుంటివాడు వెచ్చించిన ధనంతిండికెవెచ్చపెట్టుకొనియున్నచో కొన్ని సంవత్సరాలు కులాసాగా జరిగిపోయెడిది. గానీ!.... అకులు, చేతులు కాలినతర్వాత ఏల?—లోపములు విద్యార్థులకు బోధింపవీలుగానివి గ్రుడ్డి, మూగ, చెముడు, కావచ్చును. వీరు శరీరకష్టముచేసైనా జీవించగలరు. గాని కుంటివాని లోపము అట్టిదిగాదు. ఈ కుంటివాని బ్రతుకు నోటిపైనే ఆధారపడియున్నది. అట్టి వృత్తి ఉపాధ్యాయవృత్తి శరీరము కష్టపెట్టలేక సరిగదా! కూర్చున్నదగ్గర నుండి కదలనేలేడు. అట్టివానికి ఉపాధ్యాయవృత్తి యివ్వనప్పుడు. మరొకవృత్తి ఏది ఇవ్వగలరు? ఏదీలేదు.

అంటురోగులు బడులందు చదువరాదని శాసించియున్నట్లు కుంటివారుగూడా చదువరాదని శాసించినచో యీ వ్యయప్రయాసలు లేకుండాపోవు. వాని బిచ్చపు గిన్నె ఎచటకుపోదుగదా! ఇంతకూ కుంటివాడొనర్చిన దేశద్రోహము ఏదో! లేకున్నచో ఒకరూ వీరికి చేయూతనిచ్చి పరవాలేదబ్బా! నేనున్నాను అని అనలేకుండా ఉన్నారే?

—బూరాడ గోపాలం.

# వివేక ప్రశ్నలు

అక్షరములు మూడు_అగును చర్మవ్యాధి;
ఆదివర్ణము దప-యంత్రమగును;
మొదలు చివర లొక్క-ముదిత పేరగు చూడ
అట్టివ్యాధియేదో ? అరసి చెపుడు.

—ఉద్దగిరి అప్పలనరసయ్యగారు,
హెడ్మాష్టరు-వేచలపువానిపాలెం.

పంచవర్ణములను_బరగు పూవొక్కటి;
మొదటి రెండు రక్త-మునకుఁ జెల్లు;
మూడు_అయిదు-వర్ణములుగూడి జలయగు
ఒకటి-నాల్గు-ఐదు-ఒప్పు విధికి.

—బూరాడ గోపాలంగారు,
టీచరు-7డ్డవానిపేట.

కేందు నాల్గక్షరంబుల _ జలచరంబు;
ఆది_మూడవదియుఁ-గూడి-యంత్రమగును;
ఆది వర్ణంబు దొలగింప - అధికమగును;
తెలివిగలవారు తెల్పుడు - దీని పేరు.

—తిప్పాభొట్ల భాస్కరరావుగారు, హెడ్మాష్టరు - మొగల్లు.

---

## జూలై - ఆగష్టునెలల చిత్రప్రశ్నలు

(1951 సం॥ జూలై_ఆగష్టునెలల సంచికలో ప్రకటింపఁబడిన)

### వివేకప్రశ్నలు

అను చిత్రప్రశ్నలకు సమాధానములు

### 1. కాసారము        2. కదలి

*        *        =

చందా నెం.        రెండు ప్రశ్నలకు సరియైన సమాధానములు పంపినవారు.

374 యస్. కె. డి. ప్రసాదలింగంగారు - హెడ్మాష్టరు - దుగ్గిరాల.
82 కె. చంద్రయ్యాయుడుగారు - టీచరు - కొడవండ్లపల్లె.
551 టి. శ్రీరామరాజుగారు - మేనేజరు - హెడ్మాష్టరు - అమలాపురం
290 జగ్గువరపు వేంకటేశ్వరరావుగారు - కొమరవోలు
368 అల్లరాజు సూర్యారావుగారు - హెడ్మాష్టరు - శృంగవరము
455 అల్లంరాజు బంగారంగారు - టీచరు - కొంతంగి
202 భోగాపురపు సీతారామస్వామిగారు - హెడ్మాష్టరు - కొట్టిశ
444 కె యల్. నారాయణప్పగారు - టీచరు - న్యామద్దల
569 కలిదిండి సత్యనారాయణరాజుగారు - టీచరు ? మొయిద
146 వి. సుబ్బరాయాచారిగారు - వడ్రంగి - పుష్పాల
467 చెరుకుపల్లి వెంకట సుబ్బయ్యగారు - హెడ్మాష్టరు - పెదఓగిరాల
14 రేగిడి సత్యనారాయణగారు - మేనేజరు - కోటిపాం
262 దోశల తిమ్మశెట్టిగారు - టీచరు - చింతలవానిపేట
బి నరసయ్యగారు - సెక్రటరి - T. A సెంటరు - రైల్వేకోడూరు
421 తిప్పాభొట్ల భాస్కరరావుగారు - హెడ్మాష్టరు - మొగల్లు




# ట్రెయినింగు సమస్య

ఈనాడు ప్రజానీకమునందు విద్యాభిలాష హెచ్చినది. విద్యార్థుల సంఖ్య పెరిగి పోవుచున్నది. విద్యాప్రచారము సర్వతోముఖముగా సాగుచున్నది. విద్యాభిమానులైన దాతలు ముందుకు వచ్చుచున్నారు. తమతమ ధనములను విద్యాభివృద్ధికై వెచ్చించుచున్నారు. ప్రతిగ్రామములోను ప్రాథమిక పాఠశాలలు, మాధ్యమిక పాఠశాలలు, ఉన్నతపాఠశాలలు, వయోజన పాఠశాలలు, విరివిగా నెలకొల్పబడుచున్నవి. స్వతంత్ర భారతపౌరులు విద్యయొక్క విలువను గ్రహించినారు. కళాశాలల సంఖ్యగూడ పెరిగి పోవుచున్నది. విద్యామందిర నిర్మాణము నేడొక పవిత్ర పుణ్యకార్యముగా పరిగణింపబడుచున్నది.

అయితే ఒక్క సమస్య. ఇన్నిరకములైన పాఠశాలలు నెలకొల్పబడుచున్నవే! వీటి న్నిటిని చక్కగా నిర్వహించుటకు తగినంతమంది యుపాధ్యాయు లున్నారా! ఇదే ఆ సమస్య. మొత్తముమీద విచారించిన ఉపాధ్యాయుల సంఖ్య చాలినంతగా లేదనియే చెప్పవలసివచ్చుచున్నది. ఇందుకు కారణములు చాలాకలవు. ఉపాధ్యాయవృత్తి మంచిదైనప్పటికీ గౌరవ ప్రతిపత్తులు లేనిదనీ, కూడుగుడ్డలకు చాల

౧౯ పేజీ తరువాయి

228 బాడిరెడ్డి సింహాచలంగారు - హెడ్మాష్టరు - కలగాడ
208 బూరాడ గోపాలంగారు - టీచరు - గుడ్లవానిపేట
151 తిరివీధి వేంకటేశ్వర్లుగారు - మర్చంటు - రాజంపల్లె
471 ఉద్దగిరి ఉప్పలనరసయ్యగారు - హెడ్మాష్టరు - వేచలపు వానిపాలెం
234 కత్తిర నరసింహప్పడుగారు - టీచరు - పార్వతీపురం
111 దుంపతామమూర్తిగారు - టీచరు - చింతపల్లిపేట
55 పి. సూర్యనారాయణ పట్నాయక్‌గారు - టీచరు చింతపల్లిపేట
96 ఆర్. సుబ్రహ్మణ్యంగారు - టీచరు - గంగలకుర్తి అగ్రహారం.
కండికొండ మార్తాండరావుగారు - ఏలూరు.

రెండవ ప్రశ్నకు మాత్రమే

264 కాశిన ఆదినారాయణ - విద్యార్థి - గరూలియా, పశ్చిమబెంగాల్.
157 బి. రంగరాజుగారు - హెడ్మాష్టరు - క్రిష్టిపాడు

నిజీతములనీ, అవికూడా సక్రమముగా ముట్టవనీ, ఇలాంటివే యేవో కొన్ని కారణాలవల్ల కొంతమందికి ఈవృత్తిపట్ల రోత కలిగినది. ఇదొక కారణము సంఖ్యతగ్గుటకు కొన్నిచోట్ల కులతత్వం అడ్డుతగులుతున్నది. దీనివల్ల ఎంతో దెబ్బ తగులుతున్నది. కుల మతవర్గతత్వాలు పనికిరావనే స్వతంత్ర భారతములోగూడ ఏదోరూపంతో ఇవి యింకా అడ్డువచ్చుట చాల శోచనీయమైన విషయం.

గండం గడిచి పిండం బయటపడినట్లుగా ఈయాటంకాలన్నీ తప్పుకొని, యీవృత్తికి ఇష్టపడి, యేకొద్దిమందియైనా ముందుకు వస్తే వారికి ట్రయినింగు సమస్య ప్రధాన కారణంగా అడ్డువస్తున్నది. పై కారణాలన్నింటికంటె ఇదేనేడు పరిష్కరింపరాని సమస్యగా తయారయింది. వందలకొలది దరఖాస్తులు పెట్టుకొంటే సీట్లు లభించేటప్పటికి పదులలోనికి దిగుతున్నవి. ఈనాడు ట్రయినింగుసీటు లభించాలంటే యెన్నోకష్టాలు పడవలసివస్తున్నది. ఎందరినో ఆశ్రయించాలి. ఎన్నో సిఫార్సులు తేవాలి. అధికార్ల చుట్టూ ఎన్నోసార్లు తిరగాలి. ఎంతో ప్రాధేయపడాలి. దేవుడను గ్రహించినా పూజారి కనికరించడన్నట్లు అధికారి మన్నించినా గుమాస్తాపేచీలు తప్పుటలేదు. జాబితాలో పేరెక్కటానికే ముందు గుమాస్తాకు కొంతముడుపు చెల్లించుకోవాలి. లంచాలుపెట్టి ట్రయినింగుసీట్లు సంపాదించుకొనుచున్నట్లు [illegible] సూచాయగా తెలియవస్తున్నది. ఇదే నిజమైతే ఇంతకంటె మహాఘోరపాపం మఱొకటి లేదు. పవిత్రబుద్ధితో మెలగవలసిన ఉపాధ్యాయునకు ఈరూపేణా లంచగొండితనం ట్రయినింగులో మొదటి పాఠముగా బోధింపబడుచున్నదన్నమాట. ఇంతవరకు లంచగొండితనానికి పాల్పడనిది ఒక్క విద్యాశాఖయే యని లోకం భావిస్తున్నది. అదికూడ పాడైతే యింక చెప్పవలసిన దేమీ లేదు. కాని యిట్టి అవినీతికి పాల్పడకుండా తనగౌరవ ప్రతిష్ఠలను కాపాడుకోవలసిందని విద్యాశాఖకు మా మనవి.

ఈవిధంగా ఎన్నోవ్యయ ప్రయాసలకు లోనై సీటుసంపాదించుకొన్నా తీరా చేరబోయేసరికి నీకు ఫిజికల్ ఫిట్‌నెస్ సరిగా లేదనీ, నీకుకాలికుంటియనీ, నీకుమార్కులు తక్కువనీ యేవోకారణాలు చెప్పి ఆ హెడ్మాష్టరు నిరాకరిస్తారు. ఇందువల్ల మరోదెబ్బ. ఈవిధంగా ట్రయినింగు పొందుట చాలా కష్టమగుచున్నది. ఇక చాలినంతమంది యుపాధ్యాయు లెట్లులభిస్తారు? నేడుముఖ్యంగా ఈకొఱత హైస్కూళ్ళలో కనిపిస్తున్నది. బి. యిడి. ప్యాసయినవారు కఱవైపోయినారు క్రొత్తగా తెఱవబడిన హైస్కూళ్ళకు మాష్టర్లు దొఱుకుటలేదు. ఆవిద్యార్థులు పడేఅవస్థ దేవుడికే యెఱుక ఈకొఱత యెందుకు కలగాలని మాసూటి ప్రశ్న. ట్రయినింగు శిక్షణ కేంద్రాలు చాలక పోతే ప్రభుత్వము క్రొత్త వాటిని యెందుకు తెఱవగూడదు? ఈపనికష్టమైతే ఉన్నవాటినే అభివృద్ధిచేసి సంఖ్యయెందుకు పెంచగూడదు? అడిగిన వారికల్లా లేదనకుండా సీటుఎందుకివ్వగూడదు? దీనినింత గడ్డు సమస్యగా రూపొందించుట ప్రభుత్వము తలపెట్టిన విద్యాభివృద్ధి ప్రణాళికలకు, ప్రయోజన విద్యాప్రచారమునకు, నిరక్షరాస్యతా నిర్మూలనకు, పెద్ద దెబ్బ యని చెప్పకతప్పదు.

ఇచ్చట మాదొక మనవి. కేవలం "ఫిజికల్ ఫిట్‌నెస్" కారణంగా తీసుకొని మంచి తెలివితేటలు, శక్తిసామర్థ్యాలు ఉన్నకుంటి వారిని ట్రయినింగు పొందుటకు అర్హులు కారని త్రోసివేయుట తగదు. కాలుకుంటి యైనంత మాత్రాన తెలివితేటలు కుంటివి కావుగదా? కాకపోతే శిక్షణ కాలములో వ్యాయామక్రీడలలో పాల్గొన లేకపోవుట యేకదా లోపము? ఉపాధ్యాయ వృత్తికి ఇదొక పెద్దలోపముగారాదు? విధికృతమైన కుంటితనమున కెవ్వరేమి చేయగలరు? బూరాడ గోపాలం గారు పేర్కొన్నట్లు కుంటివానిని ట్రయినింగుకు పనికి రాడని త్రోసి వేయుటకంటె ఆదిలోనే విద్యాభ్యాసమునకు తగడని త్రోసి వేయుట మంచిది. నిజానికి ఎచ్చటికి పోకుండ ఒక్క చోటనే స్థిరముగా కూర్చుండి ఇతరవృత్తులు మాని యేకాగ్రచిత్తముతో బోధించు నవకాశముగల కుంటివాడే ఉపాధ్యాయ వృత్తికి తగినవాడేమో? అట్లని అపార్థము చేసికొనకుడు ఏయితర వృత్తులు చేయలేడు గనుక ఒకచోటనే కూర్చుండి పిల్లలకువిద్య గఱపునట్టి ఉపాధ్యాయవృత్తికి కుంటివాడు అన్నివిధాలా తగునని యే మా అభిప్రాయము. కాబట్టి ట్రయినింగుకు కుంటివారు అర్హులు కారు" అను నిబంధనను తొలగించి వారికిగూడ ఈసదవకాశ ముపయోగపడు నట్లు చూడవలసినదని ప్రభుత్వమునకు మా మనవి.

మొత్తము మీద ఉపాధ్యాయుల సంఖ్య చాలతక్కువగా నున్నది. కాబట్టి వలసినన్ని ట్రయినింగు శిక్షణ కేంద్రములను తెఱచి హయ్యరుగ్రేడు సెకండరీగ్రేడు, బి. ఇడి., మొదలైన వాటికి దరఖాస్తులు పెట్టుకొన్న వారందఱికీ సీట్లిచ్చి ఉపాధ్యాయుల సంఖ్యను బహుముఖములుగా హెచ్చించి సర్వతోముఖమైన విద్యాభివృద్ధికి నిరక్షరాస్యతా నిర్మూలనకు గట్టి కృషి చేయవలసినదనీ, విద్యాశాఖలో అవినీతి తొంగిచూడకుండ చూడవలసినదనీ, ఉపాధ్యాయవృత్తియొక్క పవిత్రతను కాపాడవలసినదనీ, ప్రభుత్వమునకు మా హృదయపూర్వకమైన విజ్ఞప్తి.

సంపాదకుడు.



# మద్రాసు విద్యాశాఖ ఫర్మానాలు

## 1. మద్రాసు విద్యానిబంధనలకు సవరణలు

(జి. ఓ. 1604 ది 8-6-1951)

120 వ నిబంధనలోని మొదటి వాక్యమునకు యీ క్రిందిది చేర్చుము.

"మామూలు ట్రైనింగుస్కూలులలో చేర్చుకొనబడిన విద్యార్థి 50 బడిదినములు (Working days) అగువరకును, బేసిక్ ట్రైనింగుస్కూలులలో చేర్చుకొనబడిన విద్యార్థి 30 బడిదినముల వరకును ప్రొబేషనరీగనే పరిగణించబడును. ఈ ప్రొబేషనరీ కాలములోపుగనే యే విద్యార్థియైన సమర్థుడైన యుపాధ్యాయుడుగ నిరూపింపబడనియెడల పాఠశాలాధికారిచే పాలకవర్గమువారి (Controling authority) యాజ్ఞకు లోబడి బడినుండి తీసివేయబడవచ్చును."

## 2. పాఠశాలకు రికగ్నిషను ద్రవ్యసహాయములకు సంబంధించిన సవరణలు

### i. G. O. 1864 dated 7 th July 1951.

అధ్యాయము II ప్రభుత్వ సహాయము - టీచింగు గ్రాంటు.

22 వ నిబంధనలోని 3 వ పేరాయందలి చివర వాక్యమునకు బదులుగా ఈ క్రిందిది చేర్చుము.

"ఇతర పాఠశాలలకు బిల్లులద్వారాగాని లేక మణియార్డరుద్వారాగాని ఆయా పాఠశాల మేనేజిమెంటు వారు వ్రాతమూలకముగా కోరిన పద్ధతి ప్రకారము టీచింగు గ్రాంటులు పంపబడును. కాని ఒకసారి చేసిన ఏర్పాటు మరల సాధారణముగా మార్చబడదు."

### ii. G. O. 2149 dated 8 th August 1951

1 వ నిబంధనలో యీ క్రింది రివైజుడు స్కేల్స్ చేర్చవలెను.

| | ట్రైన్డ్ టీచరుకు నెలకు రేటు |
|---|---|
| 1. ప్రతి లోయరు ఎలిమెంటరీగ్రేడు ఉపాధ్యాయునకు | రు 20 (ది 1-1-1951 నుండి) |
| 2. ప్రతి హయ్యరుగ్రేడు ఉపాధ్యాయునకు | రు 25-½-30 (ది 1-4-1950 నుండి) |
| 3. ప్రతి సికండరీగ్రేడు ఉపాధ్యాయునకు | రు 37-1-45 (ది 1-1-1951 నుండి) |
| 4. ప్రతి కాలేజిగ్రేడు ఉపాధ్యాయునకు | డిటో |
| 5. M. E. R. 13 వ నిబంధనలోని యోగ్యతలు కలిగి 12 (2) వ నిబంధనక్రింద నియమింపబడిన పండితునకు | డిటో |

షరా:— ప్రభుత్వముపై విధముగా ఆయా యుపాధ్యాయులకు గ్రాంటులిచ్చును. కాని మేనేజిమెంటువారు ట్రైనింగు పొందిన ఉపాధ్యాయులకుమాత్రముపై అదనప్రభుత్వము 3 రూపాయలను మాక్సిమంస్కేలును ఉపాధ్యాయునకు చేరినప్పటికిని యిచ్చుచునే యుండవలెను. ఏ పాఠశాల మేనేజిమెంటువారైన ఆర్థిక స్థితిగతుల రీత్యాయీ అధనపు భత్యమును యివ్వలేకున్న డివిజనల్ యిన్స్పెక్టరుగారి పర్మిషనును ఒక సంవత్సర కాలమునకు పొందవచ్చును. కాని అటులైన ఉపాధ్యాయులకు యీ అదనపు భత్యము నివ్వకున్నవారి పాఠశాలల రికగ్నిషను ఉపసంహరింప బడును.

3. నాన్ పెన్షనబుల్ సర్వీసులో ఉండే ఉపాధ్యాయుల ప్రావిడెంటుఫండు నిబంధనలకు చెందిన సవరణలు.

**i. G. O. 1979 dated 23-7-1951**

(1) నిబంధన 2 (a) లోని షరా లో యీ క్రిందిది చేర్చుము.

"ఎయిడెడ్ పాఠశాలలోని ఉపాధ్యాయుడెవరైన అదే మేనేజిమెంటు క్రిందనున్న యితర ప్రాథమిక పాఠశాలలపైన కొంతకాలమువరకు సూపర్‌వైజరుగా నియమింపబడినఎడల ఆ ఉపాధ్యాయుడు దీనితోపాటు విశేజిపాస్టరుగాగాని లేక ప్రచారకుడుగాగాని ఉండని ఎడలనూ తిరిగి ఆకాలవ్యవధిదాటిన పిదప ఉపాధ్యాయవృత్తికి వచ్చేఎడలనూ వెనుకటి ఉపాధ్యాయుపదవిలో వలెనే ప్రావిడెంటు ఫండుకు అర్హుడగును"

(2) నిబంధన 3 (a) లోని షరాలో యీ క్రిందిది చేర్చుము.

"ప్రాథమిక పాఠశాలల సూపర్‌వైజర్ల విషయములో వారు ఉపాధ్యాయవృత్తిలో నుండగా ఎంత జీతము పొందుచుండిరో ఆ జీతముపైన మాత్రమే ప్రావిడెంటుఫండు వేసుకొనుటకు అర్హులగుదురు.

**ii. G. O. 2149 dated 8 th August 1951**

నిబంధన 9 లోని షరాలో చివర యీ క్రిందిది చేర్చుము.

"ప్రావిడెంటుఫండు అవకాశమును పొందుచున్నవారు వారి పేర నిలువయున్న ఎకౌంటులోని ఫండును కేంద్రప్రభుత్వమువారిచే ప్రవేశపెట్టబడిన "పది సంవత్సరముల ట్రెజరీసేవింగ్సు డిపాజిట్లు" లోనికి మార్చుకొని లాభమును పొందవచ్చును.

4 లోకలుబోర్డులలోని ఉద్యోగుల నడవడికి సంబంధించిన నిబంధనలకు సవరణలు.

(G. O. 1435 dated 22 nd May 1951)

పైన పేర్కొనబడిన వానిలోని 6వ నిబంధనలో ఉపనిబంధన (2) ను క్లాజు (a) అని గుర్తించి యీ క్రింది దానిని క్లాజు (b) అను పేరుతో చేర్చవలెను.

"క్లాజు (b) — ఏ ఉపాధ్యాయుడైనను ఆజిల్లాబోర్డు ప్రెసిడెంటుగారి (మునిసిపాలిటీ అయినచో కమీషనరుగారి) వ్రాతమూలకమైన అనుమతి లేకయే ప్రయివేటు ట్యూషనులు తీసుకొరాదు."

# మీగోచార భావఫలాలు.

1951—9—15 నుండి 1951—10—15 వరకు

మేషం—ధనలాభం, శత్రునాశనం, ప్రయాణం, కుటుంబసౌఖ్యం, మిత్రలాభం, హఠాత్తు కార్యభంగం.

వృషభం—దైన్యం, మానసికచింత, చంచలము, ఉద్యోగప్రయత్నము, కార్యభంగం, కళత్రవిచారము.

మిథునం—మానహాని, దైవచింతన, శత్రుజయం, కార్యలాభం, దేవతార్చన, తద్ద్వారా కార్యలాభం, శుభప్రయత్నము, అధికారిమిత్రత.

కర్కాటకం—ధనలాభం, శుభప్రాప్తి, విజయం, కార్యలాభం కళత్రసుఖం, సంతానప్రాప్తి, బంధుసమాగమము

సింహం—మానసాందోళన, మనోభీతి, కించిద్ధనలాభం, దైవచింతన, తద్ద్వారా కార్యలాభం, చంచలచిత్తం విశ్వాసఘాతుకత్వం, కళత్రసుఖం చిన్నప్రయాణం.

కన్య—చలనం, కష్టం, కార్యభంగం, శత్రుపీడ, నమ్మి మోసపోవుట, శరీర అనారోగ్యం.

తుల—వ్యయం, ధననష్టం, శత్రుపీడ, కార్యభంగం, దూరస్థిత కళత్రం, విద్యావాసం.

వృశ్చికం—సుఖం, జయం, బంధుసమాగమము. పుత్రోత్సవం, పుణ్యచింత, పురోభివృద్ధిసూచన, మిత్రసహాయం.

ధనుస్సు—కార్యసిద్ధి, అర్థనాశం, ఆగంతుకబంధుత్వం, మనోవ్యాకులత, మానభంగం, శత్రుపీడ.

మకరం—దైన్యం, ధననాశం, శరీరపీడ, ప్రయాణం, మిత్రసహాయం, కష్టజీవనము, కార్యలాభం,

కుంభం—రోగం, స్థానభ్రష్టము, ధనలాభం, శత్రుబాధ, కార్యసాధకత్వం, అతివికటప్రయాణం.

మీనం—అరిష్టం, భయోత్పాతం, బంధుప్రాప్తి, గమనం, ప్రభుభయం, హాని, మధ్యమధ్య ధనలాభం, కుటుంబసౌఖ్యం, కళత్రసుఖం.

(మీ జాతకకుండలిలో గ్రహచారము బాగున్నచో గోచారఫలములు బాధించవు.)

☞ సిద్ధయోగినీ, నాడీజ్యోతిషశాస్త్రరీత్యా జాతక-ముహూర్త-వాస్తు-ప్రశ్న విషయములు-కవచధారణ విధానము మొదలగు విషయములు సరసముగా తెలుపబడును. వలయువారు నిలయంపేర ఒకకార్డు వ్రాయుడు.

ఇట్లు,

దైవజ్ఞభూషణ—డి. యస్. యన్. శాస్త్రి,

శ్రీ శివనాడీ జ్యోతిర్నిలయం, ఏలూరు. ప॥ గో॥ జిల్లా.






# స్వాతంత్ర్యదినోత్సవములు

ఈ దిగువ పేర్కొనబడిన గ్రామములలోని ఆయాపాఠశాలలలో 1951 సం॥ ఆగష్టు 15 వ తేదీ బుధవారమునాడు స్వాతంత్ర్యదినోత్సవములు జాతీయపతాక వందనములతోను, ఊరేగింపులతోను, అల్పాహార విందులతోను, బాలబాలికలకు పారితోషిక ప్రదానములతోను, నాటక ప్రదర్శనములతోను, ప్రముఖుల యుపన్యాసములతోను, అతివైభవముగా జరుపబడినవి.

1. పినపళ్ళ : తూ. గో. జిల్లా. హిందూ ఎయిడెడ్ గరల్సుస్కూలు.

సభాధ్యక్షులు — శ్రీ మెండు వీరన్నగారు. బాలికలచే "ధ్రువవిజయము" అను నాటకము ప్రదర్శింపబడినది.

2. మెరకచామవరము : నవ్యభారత ద్రవ్యసహాయ పాఠశాల.

పతాకవందనము — ఆణివిళ్ళ సుబ్రహ్మణ్య మోహనదాసుగారు.

ఉపన్యాసములు — ఆణివిళ్ళ సుబ్రహ్మణ్యం, ఆణివిళ్ళ లచ్చారావుగార్లు.

3. కమలపాడు : గ్రామపాఠశాల.

సభాధ్యక్షులు — గ్రామమునసబు శ్రీ పి గుండారెడ్డిగారు. బాలబాలికలకు బహుమతులు పంచిపెట్టబడెను.

4. కొంతంగి : తూ. గో. జిల్లా. బాలగణపతి ద్రవ్యసహాయ పాఠశాల.

పతాకప్రతిష్ఠ — శ్రీ నండూరి వెంకటాచార్యులుగారు. బాల బాలికలకు తీపి మిఠాయీలు పంచిపెట్టబడెను.

5. న్యామద్దల : అనంతపురంజిల్లా. బోర్డుహైస్కూలు.

పతాకారోహణము — శ్రీ వి. గోపాల్. S P. L. పెద్ద ఊరేగింపు సాయంత్రం 4 గంటలకు బహిరంగసభ పిల్లలకు అల్పాహారవిందు.

6. చింతపల్లిపేట : ఎయిడెడ్ ఎలిమెంటరీ పాఠశాల.

గ్రామపెద్ద పత్తిగూళ్ళ చినఅప్పలనాయుడుగారు పిల్లలకు మిఠాయీలు పంచిరి.

7. ఆకులకట్ట : శ్రీ వేణుగోపాల ఎయిడెడ్ ఎలిమెంటరీ పాఠశాల.

సభాధ్యక్షులు — శ్రీ రావిపల్లి రామ నాయుడుగారు. పిల్లలకు బహుమతులు పంచిపెట్టబడెను. ఆటల పోటీలు జరిగెను.

8. అమలాపురం : శ్రీనివాస ఎయిడెడ్ స్కూలు.

సభాధ్యక్షులు — శ్రీ ఆర్. యస్. ప్రకాశరావు, బి. ఏ. బి యిడి , సీనియర్ డిప్యూటి ఇన్‌స్పెక్టరు, జూనియర్ డిప్యూటి ఇన్‌స్పెక్టరు, ఆడెండెన్సు ఆఫీసరు, పట్టణకాంగ్రెసు సెక్రటరి, ఉపన్యసించిరి.

9. కాపవరం : హిందూ ఎలిమెంటరీ పాఠశాల

సభాధ్యక్షులు — శ్రీ భావరాజు రామకృష్ణశర్మగారు. శ్రీయుతులు కోకరపర్తి కామేశ్వరశాస్త్రి పి. వీరభద్రరావుగార్లు ఉపన్యసించిరి. పిల్లలకు మిఠాయీలు పంచిపెట్టబడెను.

10. ఉనకరమిల్లి : శ్రీ సీతారామాంజనేయ హిందూ ఎయిడెడ్ ఎలిమెంటరీపాఠశాల.

సభాధ్యక్షులు — శ్రీ బెల్లపుకొండ కృష్ణమూర్తిగారు. పిల్లలకు అల్పాహారవిందు జరిగెను.

11. తొండంగి : ఎయిడెడ్ ఎలిమెంటరీ స్కూలు,

పతాకారోహణము — శ్రీ కలిదిండి చంద్రశేఖరరాజు గారు. సభాధ్యక్షులు - శ్రీ వెణుతురుపల్లి లక్ష్మీనృసింహం పంతులుగారు. శ్రీ చేబోలు మహాలక్ష్మి శ్రేష్ఠిగారు పిల్లలకు మిఠాయీలు పంచిరి.

12. లింగరాజుపాలెం : బోర్డు పాఠశాల,

సభాధ్యక్షులు — శ్రీ దండు శ్రీరామచంద్రరాజు గారు. పిన్నలకు, పెద్దలకు, అల్పాహారవిందు జరిగెను.

13. వేణమ్మపేట : గ్రామపాఠశాల.

పతాకప్రతిష్ఠ — డా|| కె. వి జగన్నాథరావుగారు; సభాధ్యక్షులు - శ్రీ బి. ముకుందరావుగారు. శ్రీ యం. రంగారావు, బి. కన్నయ్యగార్లు జాతీయపతాకమును గూర్చియు, నేటి ప్రపంచంలో స్వతంత్ర భారతదేశ స్థానమునుగూర్చియు, నుపన్యసించిరి శ్రీ యూ. వెంట్రావుగారు విద్యార్థులకు జాతీయ పతాకములను, తినుబండారములను, పంచిపెట్టిరి. రాత్రి చిరం|| కె. గణపతిరావు, ఎ. చిరంజీవిరావు "బాపూజీ బుఱ్ఱకథ" చెప్పిరి.

# పులివెందుల తాలూకా టీచర్సు ఆహార కమిటీ సమావేశం

ది 19-8-51 వ తేదీన పులివెందుల తాలూకా టీచర్సు ఆహార కమిటీ సభకు వివిధ సెంటర్లనుండి 50 మందికిపైగా ప్రతినిధులు హాజరయ్యారు. బోర్డుతెలుగుపాఠశాలలో జరిగిన ఈ సమావేశానికి శ్రీ. ఎన్. వి. నారాయణ రెడ్డి. బి. ఎ, గారు అధ్యక్షత వహించారు.

జిల్లా ఉపాధ్యాయ సంఘకార్యదర్శి శ్రీ. వి. విజయరామరాజు గారు తిండి, బట్టలకు వుపాధ్యాయులు పడుచున్న యిబ్బందులు నివారణకు సంఘంచేసినకృషి, వివరిస్తూ బలవత్తరమైన ఆహార కమిటీని నిర్మించుకొనవలసిన అవసరాన్నిగూర్చి వుపన్యసించారు.

తాలూకా సంఘ ఆర్గనైజరు శ్రీ. జి, వెంకటప్పగారు రిపోర్టు సమర్పిస్తూ సస్యశ్యామలమైన భారతదేశం ఇతరదేశాలు పంపేధాన్యానికీ మోరలెత్తుకొని కాచియుండవలసిన స్థితిదాపురించిందని, ప్రాజెక్టుస్, కట్టించి తిండి సమస్యనుపరిష్కరించియుంటే యీ కరువు యేనాడో అంతమయ్యేదని ఉపాధ్యాయసంఘాల కృషివల్లనే నేడు మనం రేషన్ యిచ్చు ఆర్డరు సంపాదించామని కాని యీ ఆర్డరును అమలు జరుపుటలో నష్టయి అధికారులు, డీలర్లు, చాలా చేస్తున్నారని వాటిని ఎదుర్కొని, తిండి, బట్టసంపాదించాలంటే మనమంతా ఒక్కత్రాటిపై నడచి సంఘటితం కావాలని, చెప్పిరి. ఇటీవల తాలూకాలో సెంటరు ఆహార సంఘాల వలన సాధించిన విజయాలను వివదీకరించిరి.

అధ్యక్షోపన్యాసంలో శ్రీ. యస్. వి. నారాయణరెడ్డి గారిట్లుపన్యసించిరి.

ఉపాధ్యాయుడు పిల్లల భావిని తీర్చిదిద్దుతాడు. అట్టి వుపాధ్యాయుడు నేటి మనప్రభుత్వంలోకూడా తగిన జీతంలేక, గౌరవంలేక, అర్ధాన్నంగా జీవించుచుండుట చాలా అన్యాయం. దీనికి బాధ్యత ప్రభుత్వానిదే. కట్టుగుడ్డకు తినుతిండికీ, నోచుకోలేని వుపాధ్యాయులు బడిపనికుంటు పడకుండా యేవిధంగా విద్యార్థివృద్ధిని సాధించగలరు ? ధాన్యం బట్టలు ధరలు పెరుగుచున్నవి. కారణం మిల్లు యజమానుల లాభాపేక్షను ప్రభుత్వం మన్నించుటే. ఏ దేశప్రభుత్వంలోనైనా పెరిగిన ధరలకు అనుగుణంగా జీతాలునిర్ణయిస్తారు, కాని

లేకది జరుగుటలేదు. కనీసం సెంట్రల్ పేకమిషన్ నిర్ణయించిన స్కేలులైనా మీకు అమలు జరుపాలి. రాష్ట్రకేంద్ర ప్రభుత్వోద్యోగుల జీతాలలో యిట్టి తేడాలుండుట న్యాయంకాదు.

నేడు మీరు సంఘంద్వారా ఆహారాన్ని సంపాదించ గలిగారు. దానిని సక్రమంగా అమలు జరిపించుకొనుటకు సంఘాన్ని స్థాపించుటకొంటున్నారు. యెవరి కష్టాలను వారు తీర్చుకొనుటకు వారి సంఘాలను స్థాపించుకొనుట న్యాయమే. యిది న్యాయబద్ధమైన హక్కు. మీ డిమాండులను యిలాంటి సంఘాలద్వారా తీర్చుకోవాలి. ప్రభుత్వదృష్టికి, అధికారుల దృష్టికి మీకోర్కెలు తేవాలి. అప్పుడే మీకష్టాలుకొంతవరకైనా తీరగలవు.

తర్వాత సెంటర్లనుండి వచ్చిన ప్రతినిధులు రేషన్ పంపకంలో తమకు జరుగుచున్న అన్యాయాలను వివరించిరి. టీచర్సుకు ప్రత్యేకంగా కో-ఆప్ రేటివ్‌స్టోర్సు స్థాపిస్తే యీ కష్టాలు తొలగునవి చాలమంది సూచించిరి,

చర్చల అనంతరము ఈ క్రింది తీర్మానాలు ఏకగ్రీవంగా ఆమోదించబడెను.

1. ప్రభుత్వం వుపాధ్యాయులను ప్రజావసర సిబ్బంది క్రిందచేర్చి రేషన్ యివ్వాలని ఆర్డరు జారీచేసింది కాని సప్లయి అధికారులు కొంతమంది టీచర్లకు మిశ్రమ ఆహారం యిస్తున్నారు. యితర వుద్యోగులకు వలెనే వుపాధ్యాయులకు వుత్తర్వు మేరకు బియ్యం, చక్కెర సప్లయి చేయవలెను.
2. కొద్దిగ మెట్టభూమివున్నదనే కారణంచే రేషన్ కార్డులు యివ్వకున్నారు. ధాన్యం పండక కిస్తురిమీషన్ గూడా యిచ్చారు. కొట్టి కొద్ది మెట్టభూమి వున్నదనే సాకు చెప్పక కుటుంబ సభ్యులందరకు రేషన్ యివ్వవలెను.
3. కుటుంబ సభ్యుల సంఖ్యకు, కరణం సర్టిఫికెట్‌కు బదులుగా డిప్యూటి యినస్పెక్టరుగారి సర్టిఫికెట్ అంగీకరించవలెను.
4. తినుటకు యోగ్యమైన బియ్యాలనే సప్లయి చేయవలెను.
5. ఒక దఫా రెండువారములకు రేషన్ యివ్వవలెను ఆ రేషన్ 15 రోజులకులోగా యే తేదీన వచ్చినను స్టాకు లేదను కారణం చెప్పకుండా డీలర్లు యిచ్చునట్లు వుత్తర్వుచేయవలెను.
6. కోఆపరేటివ్ సొసైటీ స్థాపించువిషయమై యోచించి నిర్ణయించుటకు వర్కింగ్ కమిటీకి అధికారమివ్వడమైనది.
7. కేంద్ర ప్రభుత్వోద్యోగులకువలెనే వుపాధ్యాయులకుగూడా కరువుభత్యము పెంచవలెను.
8. టీచర్సు ఆహార పరిస్థితిపై తహశీల్దారు, కలెక్టర్‌గార్ల వద్దకు రాయభారము పోవుటకుతీర్మానించబడెను.

తాలూకా ఆహార సంఘానికి ఈ క్రిందివారిని ఏకగ్రీవంగా ఎన్నుకోవడమైనది;

అధ్యక్షులు :— శ్రీ. సి. వెంగల్ రెడ్డిగారు
కార్యదర్శి :— శ్రీ జి. వెంకటప్పగారు

సెంటరుకు ఒకరివంతున వర్కింగు కమిటీ సభ్యులుగా 7 మందిని ఎన్నుకోవడమైనది వేంపల్లె సెంటలుకు కో ఆప్టు చేసుకొనుటకు తీర్మానించడమైనది.

అర్గనైజరుగారి అభివందనముతో, జాతీయ గీతముతో, సభ జయప్రదంగా ముగిసింది

పులి వెందల,
19—8—51.

జి. వెంకటప్ప,
సెక్రటరి.

## అనంతపురం ప్రాథమికోపాధ్యాయుల సభ.

అనంతపురం టవున్ ఎలిమెంటరీస్కూలు టీచర్సు 24—8—51న శ్రీ ఎ. నారాయణప్ప (మునిసిపల్ కౌన్సిలర్) గారి అధ్యక్షతక్రింద సమావేశమైరి

రాష్ట్ర ఫెడరేషన్ సహాయకార్యదర్శి శ్రీ వి. విజయరామరాజుగారు "ఉపాధ్యాయుల వేతనములు, అందుపై ప్రభుత్వము వారుఅవలంబించుచున్న వైఖరిని, విపులీకరించిరి ప్రాథమికవిద్యకు ప్రభుత్వం ఎక్కువ డబ్బును కేటాయించవలెనని, హాజరు తక్కువకు ఉపాధ్యాయులను బాధ్యులనుగాజేసి దండించుట

న్యాయముకాదనియు, ఉపాధ్యాయుల నికృష్టస్థితిని తొలగించుకొనుటకు సంఘము అవసరమనియు, అట్టి సంఘ స్వాతంత్ర్యమును కాపాడుటకు ఫెడరేషన్ చేయు కృషికి సహకారమివ్వవలెనని, ఉపన్యసించిరి.

అధ్యక్షులు యిట్లు వుపన్యసించిరి. ఉపాధ్యాయులు దేశమునకు పునాదివంటివారు. భావిపౌరులైన బాలురు మంచివారైన, చెడువారైన. ఆ బాధ్యత పూర్తిగా ఉపాధ్యాయులదే. అటువంటి గురుతరబాధ్యత వహిస్తున్న ఉపాధ్యాయుల స్థితి నేడు చాలా నికృష్టంగావుంది. మేధస్సు ఖర్చుపెట్టి పనిచేయు టీచర్లు కూటికిలేక కుమలడం సహింపరానిది.

జీతాలు పెంచుటకు డబ్బులేదని అనేక డిపార్టుమెంట్లకు కోట్లకొలది ఖర్చు పెట్టి ఎక్కువ పెద్ద ఉద్యోగుల కొరకు సెక్రెటేరియటుకు కోట్లకొలదిపైకం వెచ్చించుచున్నారు.

ఫెడరేషన్ మీకొరకు పనిచేయుచున్నది. మంత్రులు తమంతటతాము మీకు మేలు చేయలేరు. మీ సంఘంద్వారానే మీ కష్టాలు తీరగలవు. చట్టబద్ధముగ తమ కోర్కెల సాధించుకొనుటకు ప్రతి ఒక్కనికి హక్కుగలదు. విభేదాలు మాని ఐక్యతగా పోరాడండి. విజయం లభిస్తుంది. అని ఉపన్యసించిరి.

ప్రతి టీచరు తన శక్తికొలది ఫెడరేషన్‌కు ఆర్థిక సహకారం చేయుటకు అంగీకరించిరి.

—టి. మునిరెడ్డి - ప్రా. ఉ. సం కార్యదర్శి.

## వయోజన విద్యా సంఘ సమావేశము

ది 22—8—51 తేదీ సాయంత్రం 5 గంటలకు బోర్డు ఉన్నతపాఠశాలా భవనమున పైసమావేశము శ్రీ బండి ఆంజనేయులు, B A., BED గారి యాజమాన్యమున వయోజనవిద్యా ప్రచారపు డిప్యూటీ ఇన్‌స్పెక్టరు శ్రీ పి. నాగేశ్వరరావు B A, BED. గారి సమక్షమునను జరుపబడెను. శ్రీవారు తమ సిబ్బందితోను, ప్రచారపు శకటముతోను, యీ గ్రామమునకు విచ్చేయుటలోగల వుత్కృష్టభావములను అధ్యక్షులవారు సభికుల కెరుకపరచిరి. తదుపరి ప్రస్తుత పరిస్థితులలోగల దేశవాసుల కర్తవ్యములను రాబోవు ఎన్నికలలో వోటర్లకుగల బాధ్యతలనుగూర్చియు, నిరక్షరాస్యతా నిర్మూలనకై ప్రభుత్వము చేయుచున్న కృషినిగూర్చియు శ్రీ నాగేశ్వరరావుగారు విపులముగా ఉద్ఘాటించిన తరువాత శ్రీ యం. లక్ష్మీనరసయ్య (H. M) గారి ధన్యవాదములతో సమావేశము చాలింపబడి రాత్రి 8 గంటలకు సుమారు 1500 మంది గ్రామీణులయెదుట చలన చిత్రప్రదర్శనములు జరిగెను. తర్వాత శ్రీ బండి ఆంజనేయులుగారు వయోజనవిద్యావసరములగూర్చి అతి విపులముగా పామర జనులకుసైతం మర్మమగునటుల నొక్కి వక్కాణించిరి. సభ నాటితో చాలింపబడెను.

— కె. యల్. నారాయణప్ప, బోర్డు హైస్కూలు, న్యామద్దల.

## వీడ్కోలు సన్మానము

న్యామద్దల :

ది 13—8—51వ తేదీ సాయంత్రం 5 గంటలకు న్యామద్దల బోర్డు ఎలిమెంటరీపాఠశాలాభవనమున శ్రీ బి. ఆంజనేయులు, B A, BED గారి అధిపత్యమున పై సమావేశము జరుపబడెను, అందు 20 సంవత్సరములుగా హయ్యర్ ఎలిమెంటరీపాఠశాలయందు ప్రధానోపాధ్యాయులుగా పనిజేసి యిటీవల నిడేయూర నూతనముగా స్థాపింపబడిన ఉన్నతపాఠశాలకు బదిలీకాబడిన శ్రీ యం నంజుండరావుగారికి వీడ్కోలు యిచ్చు సందర్భమున శ్రీవారిని పుష్పమాలాలంకృతుల గావించిన తదుపరి వారియందుగల వున్నతాశయములగూర్చియు, వారి విద్యాపటిమనుగూర్చియు, వారి అనర్ఘభావములగూర్చియు వారి ఎడతెగని కార్యదీక్ష, విద్యాకౌశలములనుగూర్చియు, శ్రీ యం. లక్ష్మీనరసయ్య, శ్రీ లక్ష్మీనరసప్ప, శ్రీ కె. యల్. నారాయణప్పగార్లు విపులముగా ముచ్చటించిరి. తర్వాత నంజుండరావుగారు తన విద్యుక్తధర్మముల తాను నెరవేర్చితినని వుపాధ్యాయుని బాధ్యతలగూర్చి వక్కాణించిన తర్వాత అధ్యక్షులవారి దీర్ఘోపన్యాసముతోడను, అల్పాహారవిందుతోడను, జనమనగణగీతముతోడను సభ ముగింపబడెను.

— కె. యల్. నారాయణప్ప, బోర్డుహైస్కూలు - న్యామద్దల.

Edited by Sri M. Venkata Ratnam Garu, B.A, & Printed and Published by Sri E. Venkaiah Garu at his Pattabhirama Press, Eluru.

ANDHRA RASTRA PRARAMBHA VIDYA
Regd. M.N. 3766 Vol. 40. - No. 6